# నూలు సొగసులు






రాజ్‌కమల్ చీరలు —
ఫ్యాషన్‌కు తగిన రీతిలో
అధునాతన సృష్టిలోని
సోయగాలను
మేళవింప జేస్తాయి.

రాజ్‌కమల్ వారి చీరలో
సినీతార జయప్రద.

**రాజ్‌కమల్**
కాటన్ ప్రింటెడ్ చీరలు

*Internationals*
**MARKET QUEEN**
342178®

KIRON/RKS/83

విమల్ సూటింగ్‌లో సరికొత్త శ్రేణికై
నేడే విచ్చేయండి మంగళ్‌దీప్‌కి.




మంగళ్‌దీప్

కోఠీ, హైదరాబాద్, ఫోన్ : 45786

ఆంధ్ర ప్రదేశ్‌లో అన్నిటికన్నా పెద్దదైన విమల్ షోరూం



Mudra/RTI/1177TEL




## ముఖచిత్రం

మా డిస్కో కింగ్, సినీనటుడు చిరంజీవి, సుహాసిని జంటను అట్టపై వేయవలెనని నా కోరిక

బి ప్రకాశరావు, బరంపురం

* * *

ఎన్నో నాళ్లనుండి ఎదురు చూస్తూ యున్న మా యొక్క ప్రియ అభిమాని శ్రీదేవి ముఖచిత్రం 23–12–83 తేదీ పత్రికపై ప్రచురించినందుకు ఎంతో సంతోషముగా యుంది చూడముచ్చటగాను ఉంది ఇంకా చిలిపితనపు చెక్కిళ్లు, ఆమె ముఖకవళికలలో అణువణువునా తొంగి చూస్తూయున్న చిరునవ్వు

పి బి రాధాకృష్ణమూర్తి, ఇతరులు, భువనేశ్వరం

## అమ్మా నీ పాలు చేదే....

ది 23–12–83 నాటి సంచిక ముఖచిత్రం శ్రీదేవి చాలా బాగుంది ఈ సంచికలోని కొండముది శ్రీరామచంద్రమూర్తిగారి ''అమ్మా నీ పాలు చేదే'' అనే కథ బాగుంది

కాని అందులో సంవత్సరము వచ్చిన పిల్లకి, అందులోనూ మాటలువచ్చిన పిల్లకికూడ పాలు అవసరమని వ్రాయుట చాలా అసహజంగా ఉంది ఆ వయసులో ఆ పిల్ల అన్నం తిని బ్రతకవచ్చు కదా! లేదా పోత పాలు తాగి బ్రతికే ఆస్కారం ఉంది ఇది పాఠకులు గమనించి ఉంటారని భావిస్తున్నాను

ఎమ్ అన్నపూర్ణ, కొవ్వూరు

## అమృతం కురిసిన రాత్రి

23–12–83 సంచికలో 'అమృతం కురిసిన రాత్రి' కథ చాలా బాగుంది దిక్కులేని స్త్రీ ఒంటరిగా జీవించడానికి అవకాశం లేకపోతే, ఆ సమాజానికి అన్నీ హాలాహలం కురిసిన రాత్రులే! కథలో ప్రధాన పాత్రవంటి వ్యక్తుల ద్వారా మాత్రమే ఆ సమాజం బాగవుతుంది మంచి మనసుగల అటువంటి వ్యక్తులతో నిండిన సమాజానికి అన్నీ అమృతం కురిసే రాత్రులే!

కూచిభొట్ల విశ్వనాధశాస్త్రి, తెనాలి

## వ్యాసాలు

59 సెప్టెంబరు 16 సంచిక నుంచి ప్రచురించిన 'అభినవ భగీరధుడు' సర్ అర్ధర్ కాటన్ గురించి తెలియపరచిన యదార్థగాథ నేటి యువతరానికి మార్గదర్శకముగానున్నది

స్వరాజ్యలక్ష్మి, ఆనందగజపతిరావు, తెట్టంగి

## సినిమా కబుర్లు

శ్రీదేవి ముఖచిత్రం వేసి అభిమానులను ఆనందపరిచారు సినిమా కబుర్లలో మోహన్‌కుమార్ హింది రంగానికి తరలిపోతున్న తెలుగుతారల గురించి విపులంగా వ్రాశారు

హిమబిందు, డోర్నకల్

## అశోకుడు – ఔరంగజేబు

ఏ సిద్ధాంతంపట్లనైనా వైముఖ్యం కలిగి ఉండడం పైనే ఆధారపడే ఆ వ్యక్తి వ్యాఖ్యలను దురదృష్టకరం, ప్రగతి నిరోధకంగా వర్ణించడం సజబు కాదు అసలు ఆలోచించాల్సింది ఆవ్యక్తికి శాస్త్రీయ విశ్లేషణకు తగిన అవగాహన ఉన్నదా లేదా అన్న విషయం డా॥ జయదుబాషీని విమర్శించిన మార్క్సు అభిమానుల విమర్శలు కేవలం డా॥ జయ్‌దుబాషీ మార్క్సిజంకు వ్యతిరేకం కాబట్టి అతని వ్యాఖ్యల్ని అసంబద్ధాలని విమర్శించాయి ఇది సరైన పద్ధతి కాదు ఎందుకంటే, ఆయన సైద్ధాంతిక విశ్లేషణ, హేతువాతబద్ధ విచారణా, సుస్పష్టంగా ఉన్నాయి చారిత్రిక సిద్ధాంతాలపైనే ఆయన ఆధారపడ్డారు కానీ, ఏ సిద్ధాంతాన్నీ గుడ్డిగా పొగడలేదు అయితే ఆయన హిందూత్వ అభిమాని అది సహజం ఎందుకంటే, భారతీయులకు ప్రస్తుతం గర్వకారణం హిందూ విచారధార మాత్రమే అయినా ఆయన హిందూ మతంలోని మూఢాచారాల్ని సమర్థించడానికి ప్రయత్నం చేయలేదు ఒక సెక్యులర్ వాది డా॥ జయ్‌దుబాషీని మతవాద ప్రోత్సాహకుడిగా వర్ణిస్తూ ఉదాహరణగా ఔరంగజేబు తండ్రిని చంపి అధికారంలోకి వస్తే అది పెద్ద తప్పు కాదని చెబుతూ అశోకుడు మాత్రం తండ్రిని చంపలేదా? అని ప్రశ్నించారు నిజమే ఎంత ఆశ్చర్యకరం! అశోకచక్రవర్తిని ఔరంగజేబుతో పోల్చటం! నిజంగా పరమత దురాభిమానానికి పరాకాష్ట! ఔరంగజేబు కేవలం ఒక స్వమత దురభిమానిగా, పరమత వినాశకుడిగా, అధికార దాహ పీడితుడిగా పేరు పొందాడు కానీ, అశోకుడు, విశ్వశాంతికి, హింసను సంపూర్ణంగా నిషేధించి బౌద్ధమత ప్రచారానికి జీవితాన్ని ధార పోసాడు

చిలుకూరి మధుసూదనరావు, చంపాపేట

## విచారకరం

ప్రముఖ రచయిత 'హవిస్' మరణవార్త చాలా బాధ కలిగించింది కథా రచన చిన్న మలుపు తిరిగిన రోజుల్లో హవిస్ కథలు తరుచుగా కనిపించేవి ఆ రచయిత కథల్లో 'మమత' గుర్తుపెట్టుకోవల్సిన కథ

పి ఆర్ లక్ష్మి, ఛత్రపూర్ ★

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు
**దేశోద్ధారక కాశీనాథుని**
**వాగేశ్వరరావు పంతులుగారు**
స్థాపితం 1908
***శివలెంక శంభుప్రసాద్***
**సంపాదకుడు .**
[1938–1972]
శుక్రవారం 13–1–84'
రుధిరోద్గారి నామ సం పుష్య శు దశమి
**సంపుటము 76 సంచిక 18**
**సంపాదకుడు**
***శివలెంక రాధాకృష్ణ***

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు | 1-50 |
| ఆరు మాసాల చందా | రు | 42-90 |
| పోస్టులో ఏడాది చందా | రు | 85-80 |

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**
గాంధీనగరం. విజయవాడ-520 003

# విషయానుక్రమణిక

**ముఖచిత్రం :**

న టి సు మ ల త
(ఫొటో పి రవిచందర్)

***క థ లు :***


| | |
|---|---|
| కుక్క—బుద్ధి | 9 |
| దూ ర ం | 24 |
| అనుబంధం | 42 |
| భ య ం | . 57 |


***సీరియల్ నవలలు :***


| | |
|---|---|
| యక్షగానం | 16 |
| గోరంత దీపం | 28 |
| అనురాగ తరంగాలు | 50 |


***వ్యాసాలు, శీర్షికలు :***

ఉత్తరాలు–4, లో క ం పో క డ–5, న్యూఢిల్లీలేఖ–6,వ్యక్తిగతం,వారఫలం–14, బాల విజ్ఞానం – 22, చెట్లకి ప్రాణం పోస్తున్న సుందర్‌లాల్ బహుగుణ–27, ఇ'వేమన' పద్యాలు–33, సినిమా–34, సరాగమాల–40, ప్రశ్నావళి – 41, ధర్మపథం – 47, డాక్టర్ సలహాలు – 48, ఫాలాకుని డైరీ – 56, హై ద రా బా ద్ నో ట్ బు క్ – 64, అవీ–ఇవీ–అన్నీ–66

## లోకం పోకడ—ఊమెన్












# 1984 పీడకలా?




జార్జి ఆర్వెల్ బతికి ఉంటే 80 ఏళ్ల వయసు ఉండేదతనికి కాని నాకు అతను చిన్నవాడుగానే జ్ఞాపకం ఎందుకంటే ఆర్వెల్ చనిపోయేప్పటికి అతనికి 48 సంవత్సరాలు మాత్రమే – 1950లో బాగా చలిగా ఉన్న కాలంలో మరణించాడు అతను చనిపోతాడనగా ఆరు వారాల ముందు వెళ్లి ఆర్వెల్‌ని చూశాను అప్పుడతను ఆసుపత్రిలో ఉన్నాడు మాలో కొందరు ఆర్వెల్ కోరికమీద బయటికి వెళ్లి సిగరెట్‌పెట్టె ఒకటి కొనుక్కువచ్చాము ఆసుపత్రివాళ్లు "పొగ తాగరాదు" అని నిషేధం విధించినా ఆర్వెల్ లెక్కచెయ్యలేదని నేననుకున్నాను

జార్జి ఆర్వెల్ రాసిన పుస్తకాలలో "1984" ఒకటి నేను అతనిని కలిసినప్పటికే అది వెలువడింది కాని నేను దానిని చదివి ఉండలేదు అంత ప్రసిద్ధమయిన పుస్తకం చదవకపోయినా ఆర్వెల్‌తో పరిచయం కల కొద్దిమందిలో నేను ఒకడిని అనుకుంటాను

1946లో లండన్ మజలీస్ అనే భారతీయ విద్యార్థిసంఘం జార్జి ఆర్వెల్‌కి ఒక విందుచేసింది నేను అతనిని మొదటిసారి కలిసింది ఆ విందులోనే అతను రాసిన "ఎనిమల్ ఫార్మ్" పుస్తకం అప్పటికే బాగా పేరు పొందింది (ఆర్వెల్ మాత్రం అంత పేరు పొందినవాడు కాదు!) ఆ విందు సోహో ప్రాంతంలోని ఒక చిన్న హోటల్‌లో జరిగింది నేనూ ఆర్వెల్ కూర్చున్న బల్లవద్దనే కూర్చున్నాను అదే బల్లవద్ద నవలా రచయిత ఫార్‌స్టర్, రాజకీయవాది కృష్ణమీనన్ కూడా ఉన్నారు నాకు మీనన్ అంతక్రితమే తెలుసు తక్కిన వాళ్లిద్దరూ తెలీదు ఆర్వెల్ ఖాకీ షర్టు, పసుపు టై వేసుకుని ఉన్నాడు

"నేను బి బి సి లో పని చేస్తున్నాను" అని తనకి తనే పరిచయం చేసుకున్నాడు నేను అప్పటికి "ఎనిమల్ ఫార్మ్" సయితం చదవలేదు!

"మీరు చిన్నపిల్లలకి కథలు రాస్తారా?" అని అడిగాను

"రాస్తాను! అన్ని వయసుల పిల్లలకీ కథలు రాస్తాను!" అన్నాడు-ఆయన చిరునవ్వుతో

ఆర్వెల్ బీహారు రాష్ట్రంలో పుట్టాడు "నేనూ కొంతవరకూ భారతీయుడినే," అన్నాడు (భోజనం మాత్రం భారతీయ భోజనం కాదు) అది అయిపోయిన తరువాత ఆయన, నేనూ, ఇంకొక భారతీయ విద్యార్థి (పేరు గుర్తు రావడం లేదు) కలిసి పిక్కాడిల్లీ స్టేషన్ దాకా నడిచి వెళ్లాము దారిలో ఒక "పబ్"లో ఆగి పానీయాలు సేవించాము నేనూ, మరి కొందరూ యుగోస్లావియా వెళ్లి స్పెయిన్ మీదుగా తిరిగి వచ్చేద్దామనుకుంటున్నాము— అని ఆయనతో అన్నాను

"నా హోమేజి టు కాటలోనియా (నవల) చదివారా?" ఆర్వెల్ అడిగాడు నేను దాని పేరు కూడా వినలేదు సిగ్గుపడి సమాధానం చెప్పకుండా ఊరుకున్నాను ఆర్వెల్ తన జేబులోంచి ఆ నవలని తీసి ఇచ్చాడు నాకు "ఎనిమల్ ఫార్మ్‌కన్నా ఇదే మంచి పుస్తకం నా దృష్టిలో" అన్నాడు ఆ తరువాత మేము విడిపోయాము ఒక సంవత్సరందాకా తిరిగి కలుసుకోలేదు ఒక రోజు "ఇండియా లీగ్" కార్యాలయం బయట రోడ్‌మీద హటాత్తుగా తటస్థపడ్డాడు ఆయన నాకు

ఇది 1947 ఆగస్టు తర్వాతే అయి ఉండాలి ఎందుకంటే, అంతకుముందు నాకు నాథ్‌పయితో పరిచయం అయింది సరే, ఆర్వెల్ అప్పటికి "ట్రిబ్యూన్" పత్రిక సాహిత్య సంపాదకుడయ్యాడు ఆ వారపత్రికని అన్యూరిన్ బెవాన్, ఆయన భార్య జెన్నీలీ కలిసి స్థాపించారు అది సోషలిస్టు విధానాలని బలపరిచే పత్రిక ఆర్వెల్ లండన్‌దగ్గిర ఒక గ్రామంలో ఉండేవాడు రోజూ లండన్ వచ్చి వెడుతూ ఉండేవాడు నేను అప్పటికి ఆర్వెల్ రాసిన "ఎనిమల్ ఫార్మ్" "హోమేజి టు కాటలోనియా" నవలలు చదివేశాను వాటిని మరాటీలోకి అనువాదం చేద్దామనుకుని 'పెంగ్విన్' పుస్తకాల సంస్థకి రాశాను అనుమతి ఇచ్చారు కూడా

"మళ్లీ ఏదయినా రాస్తున్నారా?" అని అడిగాను

"రాస్తున్నాను రెండు అధ్యాయాలు పూర్తిచేశాను రాయటం ఆపి, ఆలోచిస్తున్నాను" అన్నాడు అతను

ఇదంతా జరిగిన తరువాత ఒక సంవత్సరం పాటు ఆర్వెల్‌తో నా పరిచయం బాగా పెరిగింది అతనిది చాలా బోళా స్వభావం కొంచెంకూడా దాపరికంలేదు, స్వచ్ఛమయిన మనస్సు తరుచు ఒక చిన్న 'కేఫ్'లో కలుసుకుని ఐస్‌క్రీమ్, టీ, టోస్టు (నేను), పందిమాంసం, చేపలు (అతను) తీసుకుంటూ ఎంతో మాటలాడుకునేవాళ్లము 1984ని గురించి ఎక్కువ చెప్పేవాడుకాడు ఇండియా, బర్మా దేశాలని గురించి మాటలాడేవాడు అతను బర్మాలో కొంతకాలం పోలీసు శాఖలో పనిచేశాడు మాటలాడుతున్నంతసేపూ ఆర్వెల్ తన 'ట్రిబ్యూన్' కాపీమీద బొమ్మలు

## న్యూఢిల్లీ లేఖ

గీసేవాడు ఆ కాపీని నేను తీసుకుని దాచుకునే వాడిని అన్నిటినీ స్వదేశానికి తీసుకు వెళ్లిపోయాను వాటిని కలిపి బైండు చేయిద్దామనుకుని దాస్తే తెలీక నా భార్య దానిని 'చెత్త' గా అమ్మేసింది!

ఆర్వెల్‌కి ఈ సంగతి తెలిస్తే ఎంత నవ్వుకునేవాడో

ఆర్వెల్ ఒక విలాస పురుషుడు, అనుకునే వాళ్లు ఎందరో నిజానికి అతను చాలా నిలకడ మనిషి ముందు రిపోర్టరుగా మొదలుపెట్టాడు రాయటం నేర్చుకోవాలంటే ఇది మంచి పద్ధతే అయితే, ఎంతకాలం వార్తలని గురించి రాస్తాడు? నవలలు రాయటం ప్రారంభించాడు 1984 చదివితే ఒక పీడకల లాగ అనిపిస్తుంది కాని దానిని అతను మరణిస్తున్నాననే నిస్పృహతో రాయలేదు అసలు దానిని గురించి అతను ఎక్కువ మాటలాడేవాడేకాదు ఆర్వెల్ స్వంత అంచనాలు "హోమేజి టు కాటలోనియా" అతని ఉత్తమ రచన స్పెయిన్‌లో ప్రజాస్వామ్యవాదులు నియంతలతో యుద్ధం చేస్తూ ఉంటే వారితో యుద్ధం చేస్తామన్న కమ్యూనిస్టులు వెనక్కి తగ్గారు ఈ ద్రోహాన్ని వర్ణించాడు ఆర్వెల్ తన నవలలో

ఆర్వెల్ మామూలు రకం రచయిత కాడు లతనిలో దాపరికం లేదు తనకి ఇష్టంలేని వారిని విమర్శించటానికి వెనుతీసేవాడుకాదు— ఉదాహరణకి "న్యూస్టేట్స్‌మన్" సంపాదకుడు కింగ్స్‌లీమార్టిన్, గాంధీ విషయంలో అతనికి కొన్ని సంకోచాలు ఉండేవి, వాటిని బయటికి చెప్పేవాడు ఆర్వెల్‌కి ఉన్న నిజాయితీ ఎవరికో కాని ఉండదు కపటం అన్నది అతనికి చాలా దూరం [ముల్క్‌రాజ్ ఆనంద్, ఖుష్వంత్‌సింగ్‌లు గుర్తుకు వస్తున్నారు నాకు ఈ సందర్భంలో! వాళ్లు రచయితలు కాదు, బండ వాళ్లు! వాళ్ల రచనలు నాకు కంపు కొట్టినట్లు ఉంటాయి]

పోయినసారి నేనూ నా భార్య లండన్ వెళ్లినప్పుడు ఆర్వెల్ ఒకప్పుడు సేల్స్‌మన్‌గా పనిచేసిన పుస్తకాల షాపు కోసం వెతికాము అది మాకు కనపడలేదు ఆ ప్రాంతం అంతా అంత మారిపోయిందన్నమాట! అక్కడి నుంచి హాంప్‌స్టెడ్ హీత్‌లో ఉన్న చిన్న కొలనులో బాతులు ఈత కొడుతూ ఉంటే చూడటానికి వెళ్లాము అక్కడ ఒక బెంచిమీద ఖాకీ షర్టు, పసుపు నెక్ టై వేసుకుని ఉన్న వృద్ధుడు ఒకతను కనిపించాడు ఒక క్షణం పాటు "ఆర్వెల్ తిరిగి వచ్చాడా!" అన్న భ్రమ కలిగింది ఏమో, 1984 లో నిజంగానే తిరిగి వచ్చి నాకు కనపడతాడేమో! నేనూ, నా భార్యా చూడటానికి వెళ్లిన ప్రాంతాలన్నీ జార్జి ఆర్వెల్‌కి చాలా ఇష్టమయినవి ★



# కుక్క-బుద్ధి

కందుకూరి వెంకట మహాలక్ష్మి

''కుక్క కరిచింది !''

''జబ్బు కుక్క కరిచింది !''

''ఉట్టి జబ్బు కుక్కేకాదు  అది పిచ్చిది కూడాను! కొట్టండి!'' అన్నారు అనటమేమిటి! వెంటనే దానిని నలుగురూ కర్రలతో కొట్టేరు కొందరు రాళ్ళు రువ్వేరు అక్కడున్న పిల్లలకి మరీ సందడిగా వుండి తరిమి, తరిమి కొడుతున్నారు

ఆ దెబ్బల బాధ భరించలేని ఆ కుక్క ''కుయ్యో, కయ్యో'' మంటూ పరుగెడుతున్న కొద్దీ దానిని ఇంకా, ఇంకా తరిమి, తరిమి చేతికి దొరికిన రాళ్ళని, ఇటికె బొంతల్ని విసురుతూ బక్కగా వున్న ఆ రోగిష్టి దాన్ని గాయపరుస్తున్నారు

ఆ దెబ్బలకి తట్టుకోలేని ఆ కుక్క పెద్దగా ఏడ్చింది ఇంతలో పెద్ద ఇటికె వచ్చి డొక్కలో తగిలింది అంతే! అది ఆ దెబ్బబాధ తట్టుకోలేక అక్కడే పడిపోయింది ఇంతలో రయ్యిమంటు ఓ కారు దూసుకొచ్చింది ఆ కారు చక్రాల కింద నిస్సత్తువతో పడున్న ఆ కుక్క పడి పచ్చడయిపోయింది అక్కడి జనం ఆ దృశ్యాన్ని ఒక్క క్షణం ఆగి ముఖం చిట్లించి చూసారు ఓ నిట్టూర్పు విడిచారు కారు ఆగలేదు శరవేగంతో తనకేమీ పట్టనట్లు దూసుకుపోయింది రోడ్డు మీద జనం తమకేమీ పట్టనట్లు ఎవరి త్రోవన వాళ్ళు వెళ్లిపోతున్నారు రక్తం మడుగులో పేగులు, నాలిక బైటికొచ్చి, రోడ్డు మధ్య భయంకరంగా పడున్న ఆ కుక్కని చూసి కొందరు అసహ్యించుకుని ముఖాలు తిప్పుకున్నారు కొందరు కాండ్రించి వుమ్మేసారు కొందరు ఆ భయంకరమైన దృశ్యాన్ని చూడలేక ముక్కులు కళ్ళు మూసుకున్నారు మరి కొందరు డొక్కున్నారు అంతా దానికి దూరంగా తప్పుకుని వెళ్ళిపోతున్నారు అంతే! దాని గురించి బాధపడ్డ వాళ్ళెవరూ లేరు

13—1—84 ఆంధ్రసచిత్రవారపత్రిక

# కుక్క - బుద్ధి

ఎందుకు బాధపడాలి ? ఎందుకు జాలి పడాలి ? అది ఎవరికి చుట్టం ? ఎవరికి ఆత్మీయురాలు ? ఎవరికి స్నేహితురాలు ? పైగా అది జబ్బుకుక్క ! జబ్బుల వల్ల అసహ్యంగా వుంది అది పెంపుడు కుక్క కాదు — చక్కటి బొచ్చుకుక్కన్నా కాదు ఒకరిని కరిచింది ! ఇంకెవర్నైనా మళ్ళీ కరుస్తుంది చచ్చిపోవడం మంచిదే అయింది

అది అలా చావకపోయిన అక్కడి జనం దానిని కొట్టి, కొట్టి చంపేసి వుందురు ఆ పనిని ఆ కారు ఆసామీ చేసి వాళ్ళ పనిని సులువు చేసి పడేశాడు అందుకు అక్కడివారు సంతోషించారేగానీ, విచారించలేదు

అక్కడే గేటు దగ్గర నిలబడి చూస్తున్న చింటూకి మాత్రం ఎంతో జాలేసింది కళ్ళంట నీళ్ళొచ్చేశాయి ఏడ్చాడు

నాలుగైదు లక్షలకి తక్కువ విలువచెయ్యని ఇంట్లో నివసిస్తూ, లక్షలు విలువచేసే బెంజ్ కార్‌లో తిరిగే చింటుకి ఆ జబ్బుకుక్క గురించి ఎందుకంత బాధ ? ఆ వ్యక్తుల్ని, ఆ కారు ఆసామిని తల్చుకుని అసహ్యించుకున్నాడు చాలా కోపం వచ్చింది "ఈ వ్యక్తులు దుర్మార్గులు, స్వార్థపరులు, హీనులు ! ఆ కుక్కే అందంగా, ఆరోగ్యంగా వుండి వుంటే దానిని ఇలా వీధిలో వదుల్తారా ? వదిలినా ఇలా హింసిస్తారా ? ఒకవేళ కారుక్రింద పడినా ఆ కారు యజమానిని ఆపి తిట్టిపోసి వుండేవారు ఈ మనుష్యులు డబ్బుకేకాదు విలువిచ్చేది! అందానికి, ఆరోగ్యానికి ఎంత విలువిస్తారు ! మంచి అందంగా, ఆరోగ్యంగా వున్న కుక్కనే పెంచుకుంటారు దానికి స్నానం చేయిస్తారు, బ్రెష్ చేస్తారు ! బిస్కట్లు, రస్కులు పెడతారు ! పాలు అన్నం పెట్టడమే కాకుండా ఏవేవో టానిక్కులు కూడా బలానికి ఇప్పిస్తారు ! కారులో షికారుతిప్పుతారు ఇంట్లో నౌకర్లే కాకుండా యజమాని, పిల్లలూ కూడా పలకరించి రోజూ యోగక్షేమాలు కనుక్కుంటారు ! ప్రేమగా దువ్వుతారు ! ఇంటికొచ్చిన వారందరితోటీ ఆ ముద్దుల కుక్క లీలలన్నీ చెప్పి మురిసిపోతారు ! పాపం మరి దీన్నో ?!'' అని జాలిగా అక్కడ చచ్చిపడున్న దాన్ని చూసి బాధపడసాగాడు చింటు

నోరులేని ప్రాణి తన బాధని ఎవ్వరికీ వ్యక్తం చెయ్యలేదు తనలో తనే బాధపడి, తనని తనే ఊరడించుకుని ఉపశమనం పొందాలి

చింటూ ఆ చనిపోయిన — కాదు, కాదు మర్డరయిన కుక్కనిచూసి బాధపడుతున్నాడు ఎందుకో తెల్సా ?

ఒకానొకప్పుడు అదీ తనింట్లోనే వుండే లక్షాధికారి ముద్దులకుక్క తనతో కారులో తిరిగి, తనతో ఆడుకుంటు పెరిగింది అంతే కాదు అమ్మా, నాన్నా దానికి స్వీటీ అని పేరు పెట్టి కూతురులేని లోటు తీర్చుకుని, కూతురి కన్నా ప్రేమగా పెంచారు అదీ తనూ కలిసి రోజూ షికారు వెళ్ళేవారు ముచ్చట్లాడుకునే వారు అంతేకాదు కొంతకాలం తరువాత అది నలుగురు పిల్లల తల్లికూడా అయింది ఆ పిల్లల్ని నాన్నగారి ఫ్రెండ్సు తీసుకెళ్ళిపోతే పాపం నా దగ్గరకొచ్చి మొరపెట్టుకుంటే దానిని ముద్దు చేసి ఊరడించాను అంతకంటే ఏం చెయ్యలేనుగా మరి !!

ఆ రోజు స్వీటీ అన్నం తినలేదు బాధగా మూలగసాగింది నాకు చాలా బెంగేసింది దాని దగ్గర నిలబడటంతప్ప ఏమీ చెయ్యలేకపోయాను అమ్మ, నాన్నగారితో చెప్పాను నాన్నగారు స్వీటీని చూసి కారులో కూర్చోబెట్టుకుని ఎక్కడికో తీసుకెళ్ళేరు మళ్ళీ కొంచెంసేపటికి తీసుకొచ్చారు దానిని బైటే నిలబెట్టి అమ్మతో ఏదో నెమ్మదిగా చెప్పారు అంతే — బంట్రోతుని పిల్చి ఏదో చెప్పగానే స్వీటీ మెడకి గొలుసుకట్టి ఎక్కడికో తీసుకెళ్ళిపోయాడు నడవలేక, నడవలేక నడిచి వస్తున్న స్వీటీని బంట్రోతు ఒక్క తన్ను తన్ని లాకెళ్ళసాగాడు "రా"నంటూ మొరాయించుకుకూర్చున్న దాన్ని ఈడ్చుకుంటూ తీసుకెళ్ళిపోయాడు అరుస్తూ, ఏడుస్తూ అతనితో వెళ్ళింది స్వీటీ

కొంచెంసేపటికి ఉట్టి చైనుతో తిరిగొచ్చాడు నౌకరు

స్వీటీ లేకపోవడంతో నాకేం తోచలేదు ఆ రోజు అన్నం కూడా తినబుద్దెయ్యలేదు స్వీటీ లేని లోటు తనకితప్ప మరెవ్వరికీ ఉన్నట్లు లేదా ఇంట్లో ఇన్నేళ్ళూ ఇంత ముద్దుగా ఎత్తుకుని పెంచిన అమ్మా, నాన్నారూ ఇలా దాన్ని ఎక్కడికి తరిమేసారో అర్థంకాక బాధపడసాగాను

ఆశ్చర్యం ! సాయంకాలానికి స్వీటీ మళ్ళీ వచ్చేసి గేటు దగ్గర కూర్చుని అరవసాగింది నన్నూ, బంట్రోతునీ చూసి తోకాడించింది నాకు చెప్పలేని ఆనందం కలిగింది పరుగు, పరుగున గేటు దగ్గరకి వెళ్ళేను అది చూసిన నాన్నారు గట్టిగా అరిచారు అంతే — నౌకరు కర్రుచ్చుకుని బైటికెళ్ళి దానిని తరిమి, తరిమి కొట్టేడు అంతేకాదు మళ్ళీ వస్తే కొట్టడానికో కర్ర గేటు దగ్గరుంచాడుకూడ ! అయినా స్వీటీ కొంచెంసేపటికి మళ్ళీ వచ్చి గేటు తియ్యమని అరిచింది ఎవ్వరూ తియ్యలేదు పాపం చలిలో అది అలాగే రాత్రి మట్టిలో పడుకుంది అది అన్నం లేకుండా పడుకుందని గుర్తుకు రాగానే ఆకలివేస్తున్నా నాకు అమ్మ పెట్టిన అన్నం తినబుద్దెయ్యలేదు

ఇలా అది గేటు కవతల విసిగిపోయి అనుకుంటా అప్పుడప్పుడు అలా వీధులంట తిరిగి, మళ్ళీ వచ్చి గేటు కవతలే పడుకునేది ఎంత తరిమినా, కొట్టినా పోయేదికాదు అమ్మగానీ,



నాన్నారుగానీ బైట కనిపించినా, ఎక్కడికయినా వెళ్తున్నా, వస్తున్నా గౌరవంగాలేచి తోకాడిస్తూ, తలవంచి దగ్గరకివచ్చేది వాళ్ళు స్వీటీనిచూసిచూడ నట్లే వెళ్ళిపోయేవారు గేటు తెరిచి వచ్చేటప్పుడు లోపలికి రావాలని ప్రయత్నిస్తే కొట్టి తరిమేసే వారు నన్నయితే అస్సలు దాని దరిదాపులకి వెళ్లనిచ్చేవారు కాదు ''ఆ వెధవ కుక్కని వీడి దగ్గరకి రానివ్వకండిరా ! దాని రోగాలు చింటు గాడికి కూడా అంటుకుంటాయి !'' అని అమ్మ అంటుంటే చాలా కోపం వచ్చేది రేపు నాకు రోగమొచ్చినా ఇంతేనా ? అమ్మకి రోగమొచ్చినా ఇంతేనా ? మరి నాన్నారికి వస్తే ఏంచేస్తారూ ? కానీ ఎలా అడగను ? పాపం స్వీటీ మాత్రం ఎంత మంచిదో ! అమ్మ, నాన్నారు తరిమేసినా, కొట్టినా, అన్నం పెట్టకపోయినా తన కర్తవ్యాన్ని మర్చిపోలేదే !! గేటు దగ్గర కూర్చుని ఆ ఇంటిని ఇదివరకులాగే జాగ్రత్తగా కాపలా కాసేది ఎవర్నీ ఇంట్లోకి రానిచ్చేది కాదు ఇంటి చుట్టూ తిరుగుతూ కాపలా కాసేది అంత నిర్దయగా దాన్ని చూసినా స్వీటీకి ఎందుకు కోపం రావటం లేదు ? పైగా పిచ్చిది ఇంకా ఇది తనిల్లే అనుకుని తాపత్రయపడి కాపలా కాసేస్తోంది సిగ్గులేని కుక్క ! అసలు దీనికి బుద్ధిలేదు స్వీటీకి చెప్పాలి ! కానీ ఎలా ? నన్ను దాని దగ్గరకి వెళ్లనివ్వటంలేదే !!

ఇన్నాళ్లూ ఎంతో ముద్దుగా ఎత్తుకు పెంచిన స్వీటీ గేటు బైట వుండటం చూసిన నాన్నారి ఫ్రెండ్సు నాన్నారిని కారణం అడుగు తుంటే ''దానికి పిచ్చి ఎక్కిందండీ ! ఇంట్లో వాళ్లని కరుస్తోంది కదా ? పెంచిన చేతుల్తో చంపించలేక అలా వదిలేసాం'' అనేవారు

వీధుల్లో అక్కడక్కడ తిరిగి కడుపు నింపు కుంటోందనుకుంటాను ! అప్పుడప్పుడు అమ్మ పారేసే పాత బ్రెడ్డు, చద్ది అన్నం కూడా తిని అక్కడే బైటే వుండటం అలవాటయిపోయింది రాను, రాను దాని ఒంటి నిండా ఏవేవో మచ్చలు, ఏదో రోగంతో చిక్కి అసహ్యంగా తయారయింది

ఆనంద్‌మోహన్‌గారు ఓ పెద్ద కంపెనీకి జనరల్ మేనేజర్ ఆయనకి ఎంత డబ్బుందో ఆయనకే తెలీదు ఆ మహాపట్నంలో ఆయన పేరు ఎరగనివాళ్లు తక్కువ అంటే ఆయన పరిచయం కోసం పాకులాడతారు ఏ ఫంక్షన్ జరిగినా ఆయన్ని పిలుస్తారు ఆ పిలవడం వూరికే కాదు, ముఖ్య అతిధిగానో, ప్రైజులు ఇవ్వమనో, సన్మానం చేస్తామనో, మాకు ప్రెసిడెంటుగా వుండాలనో కోరుతూ మరీ ఆహ్వానిస్తారు

ఆయన నవ్వితే అంతా నవ్వుతారు ఆయన వెనక ఎంతో వినయంగా నడుస్తూ వెళ్తారు ఆయన ఏదన్నా చెప్పగానే ఎంతో విధేయతతో చేస్తారు

ఎందుకో తెలుసా ?

# కుక్క - బుద్ధి

ఆయన తల్చుకుంటే ఏ పనయినా చెయ్యగలరు, లేదా చేయించగలరు డబ్బు సహాయం చెయ్యగలరు, లేదా చేయించగలరు ఉద్యోగాలు ఇవ్వగలరు, లేదా ఇవ్వమని రికమెండ్ చెయ్యగలరు ఇలా ఇంకా ఎన్నో, ఎన్నో !!

మరి అందుకే ఆయనంటే అందరికీ అంత ప్రేమ కదా మరి !!

ఆ ఇంట్లోకి పనిమీద రాబోయే కొత్త వ్యక్తులు ముందుగా గేటు దగ్గరున్న చప్రాసీతో స్నేహం చేస్తారు వాడి చేతిలో పదో, పరకో పడగానే ఆనంద్‌మోహన్‌గారి ఇంట్లోకి వెళ్ళే అవకాశం లభిస్తుందని తెల్సు తరవాత ఇంట్లో పిల్లలున్నారో లేదో, వుంటే ఎంత వయసువాళ్ళో తెలుసుకుంటారు

ఎందుకు తెల్సుకుంటారో తెల్సా ?

మరి ఆయన్ని మంచి చేసుకోవాలంటే ఆయన పిల్లలకి స్వీట్లో, బిస్కట్లో, పళ్ళో, బిళ్ళలో తీసుకెళ్ళి ఇవ్వాలికదా ?

''పిల్లలు లేకపోతే ?''

''ఏం చేస్తారు ! అలాంటి గొప్ప, గొప్ప వాళ్ళిళ్ళల్లో కుక్కో, కుక్కలో తప్పకుండా వుంటాయని తెలీదా ? వాటికి ఏ రస్కులో, బిస్కట్లో తీసుకెళ్తారు ''

''బలే బాగుందండీ ! చాలా ముద్దుగా వుంది జూలు బాగా తెల్లగా (లేక నల్లగా) పొడుగ్గా వుంది ! మంచి జాతిదండీ ! ఎక్కడ కొన్నారు ? చాలా బాగా పెంచుతున్నారు — మంచి ట్రెయినింగ్ ఇచ్చారు '' వగైరా, వగైరా లంటూ దానిని వర్ణించి, దాని చర్యల్ని పొగిడి, మెచ్చుకుని ఆయన్ని ఉబ్బేసి, ఆయన మెప్పు పొందాలని తాపత్రయ పడతారు రస్కులుపెట్టి ఆ కుక్కని మచ్చిక చేసుకుని దువ్వడంతో అది తోకాడిస్తుంది పొగడ్తలు విన్న ఆ పెద్దమనిషి ఐసయిపోతాడు ఆ తరవాత అలా, అలా కొన్నాళ్ళ తరవాత చంకలోని ముంత బైటికిపెట్టి చల్ల అడుగుతారు ఆ తరవాత లావాదేవీలు ఇద్దరిమధ్యా జరిగి, ఒప్పందానికిరాగానే ఆ వచ్చిన వాళ్ళ పన్లయిపోతాయి అదీ కథ !

ఓ రోజు ఆనంద్‌మోహన్‌గారి దగ్గరకి ఎవరో కొత్తాయిన వచ్చారు వచ్చినాయన కోపంతో ఏదేదో అన్నారు ఆనంద్‌మోహన్‌గారు కూడా గట్టిగా అరిచారు కొత్తాయన కోపంగా ఏదోదో అంటూ వెళ్ళిపోయాడు ఆనంద్ మోహన్‌గారెందుకో భయం, భయంగా వెళ్తున్నాయనకేసే చూసారు

ఇప్పుడదంతా ఎందుకంటే—మా నాన్నారూ గొప్ప ఆఫీసరే ! కాదు, కాదు ఆనంద్‌మోహన్‌గారే మా నాన్నారు ! నాన్నారి భయం చూస్తే నాకూ ఎందుకో భయంవేసింది

ఆ రోజు ఆదివారమేమో! ఇంట్లో నౌకర్లందరికీ శలవు నాన్నారు, అమ్మ లోపల పడుకున్నారు నేను వీధి వరండాలో కూర్చున్నాను ఇంతలో స్వీటీ గబగబా వచ్చేసి మా ఇంట్లోకి వస్తున్నాయన్నే కరిచింది అంతే — అప్పుడు ఇందాకా నేను చూసిందంతా జరిగిపోయింది — నా స్వీటీ మర్డరయిపోయింది

ఏమ్రోయ్ ! స్వీటీ పిచ్చికుక్క కాదు ! దానిని అనవసరంగా పిచ్చిదాన్ని చేసారు ! మీ పిల్లలకి జబ్బులు రావూ ! వస్తే ఏం చేస్తారు ? ఇలాగే తరిమేస్తారా ? నిజంగా పిచ్చెక్కినా తరిమెయ్యరు స్వీటీకి జబ్బు చేస్తే వైద్యం చేయించకుండా తరిమేసారు పైగా పిచ్చిదని మీ అందరితో అబద్ధం చెప్పారు అని అందరికీ చెప్పెయ్యాలనుకున్నాను అంతే కాదు —

నాన్నారండీ ! స్వీటీని, నా స్వీటీని, నా స్వీట్ స్వీటీని, నా లవ్వర్‌ని మీరే మర్డర్ చేసారండీ! దానికి జబ్బొస్తే అసహ్యించుకుని పిచ్చిదని అబద్ధం చెప్పి మీరు మీ పరువు కాపాడుకుని దాన్ని తరిమేసారు మీనించే నా స్వీట్ మర్డరయిపోయింది

మీరు ఇంట్లోంచి తరిమేసినా అది ఆ మనిషిని కరిచింది !

అది పిచ్చిది కాదు !

అది ఉట్టినే ఆ మనిషిని కరవలేదు !

ఒక హంతకుడిని కరిచింది !

ఆ హంతకుడు చంపబోయింది ఎవర్నో కాదు ! మిమ్మల్నే నాన్నారూ ! మిమ్మల్నే !!

మిమ్మల్ని హత్య చెయ్యమని కొత్తాయన పంపిన హంతకుడినే నా స్వీటి కరిచింది ! అది మీకు తెలీదు దానికి తిన్న విశ్వాసం చావలేదు మిమ్మల్ని కాపాడింది మిమ్మల్ని రక్షించబోయి తను చచ్చిపోయింది — అని అరవాలనుకున్నాను

మరి ఎందుకు అరవలేదో తెల్సా ?

ఎందుకు వూరుకున్నాను ?

నాకు మాటలు రావుగా ! నేను మాట్లాడలేను ! అసలు వాడు హంతకుడని నాకు ఎలా తెల్సిందో చెప్పనా ?

నేనూ స్వీటీ లాంటి కుక్కనే గనక !!

అందుకే అది నా లవ్వర్ !!

దాని పిల్లలు నా పిల్లలే !! 

## డాక్టరుగారి డైలమా !

వృత్తి ధర్మాన్ని పాటించి రోగి ప్రాణాలను కాపాడాలా ? లేక రోగి చివరి కోరికను మన్నించి ప్రశాంతంగా మరణించడానికి అవకాశమివ్వాలా ? ఈ ధర్మ సందేహం పశ్చిమ జర్మనీలో ఒక డాక్టరును పీడించింది కానీ, చివరకు ఆ రోగి కోరికను మన్నించి మరణించటానికి అవకాశమిచ్చాడు దానితో ప్రభుత్వం కోర్టులో కేసుపెట్టింది వృత్తిధర్మాన్ని విస్మరించినందుకు తొమ్మిది వేల మార్కులు జరిమానా విధించాలని పట్టుబట్టింది కానీ కేసు విన్న జడ్జీగారు ఆ డాక్టరు నిర్దోషి అని తీర్పు చెప్పాడు 77 సంవత్సరాలు వయసు గల ఒక వృద్ధురాలు గతించిన తన భర్తను చేరుకోటానికి 44 నిద్ర మాత్రలు, 12 మార్ఫియా ఇంజక్షన్‌లు తీసుకున్నది పొరుగువారామెను డాక్టరు వద్దకు తీసుకొచ్చారు తనను చావనివ్వమని ఒక ఉత్తరం, భర్త ఫొటో ఆమె చేతులలో ఉన్నాయి ఆ సమయంలో వైద్య సహాయం అందినా ఆమె బ్రతికి ఉండెడిది కాదని జడ్జీగారన్నారు చావటానికి హక్కు ఉండాలని కోరే జర్మన్ సొసైటీ ఫర్ హ్యూమన్ డెత్ సమాజం ఈ తీర్పును ఒక విజయంగా భావించారు



# వ్యక్తిగతం



ఐర్లాండ్‌లో మత కలహాల వార్తలు భూగోళంమీది ఈ ప్రాంతంలో అంతగా రావు ఇటీవలే ఆర్మగ్ కౌంటీలోని ఒక చర్చిలో కొందరు ప్రొటెస్టెంటు భక్తులు ప్రార్థిస్తూ ఉంటే వారిమీద తుపాకులతో కాల్చారు — మొత్తం ముగ్గురు అక్కడే మరణించారు ఏడుగురు బాగా గాయపడ్డారు ఈ దారుణం చేయించిన వ్యక్తి పేరు డోమినిక్ మెక్‌గ్లించీ అని చెప్పబడుతోంది ఇతను 29 ఏళ్ల దౌర్జన్యవాది



అసభ్యకరమయిన చిత్రాలంటే ఏమిటి? ఒక్కొక్క దేశానికి ఒక్కొక్క నిర్వచనం ఉండవచ్చుకాని జపాన్‌లో కామంలేదా సెక్స్ కన్నా ఇతర విషయాలుకూడా అసభ్యకరంగా పరిగణింపబడుతాయని కొందరు అంటారు శ్రీ అకియో గోటో పత్రిక పేరు ''ఫోకస్''ట దీని అమ్మకాలు వారాని 17 లక్షలుట ఒక సంచికలో ఒక కొరియా వనిత మరణిస్తున్నప్పుడు తీసిన బొమ్మలు వేశారు ఈ పత్రికలో ఆ వనితకి విషంపెట్టి చంపిన యువకుడే ఆ బొమ్మలు తీశాడుట ఇంకొకసారి మాజీమంత్రి ఇచిరో నాకాగావా జపాన్ కేంద్ర శాసనసభ ఆవరణలో ఒక చెట్టువద్ద మూత్రవిసర్జన చేస్తూ ఉండగా తీసిన బొమ్మ ప్రచురించారు ''ఫోకస్'' పత్రికలో



చేతులూ, జుట్టూ వెనకాల మొహం యాన్నిక్‌నోవా అనే ఆయనది ఆయన ఫ్రాన్సు దేశపు టెన్నిస్ ఆటగాడు పారిస్ నుంచి న్యూయార్క్‌కి వలస వెళ్లిపోయేముందు ఫ్రాన్సు రాజధానిలో ఒక పత్రికా విలేఖరుల సమావేశం ఏర్పాటు చేసుకున్నాడు ఇంకా పెద్ద పేరు సంపాదించుకోవాలనే తను అమెరికావెడుతున్నట్లు వివరిస్తూ గభాలున ఏడవటం మొదలు పెట్టాడు ఆయన

# వారఫలం

13-1-1984 శుక్రవారం మొదలు 19-1-1984 గురువారం వరకు

**♈ మేషం** మీరు చెప్పే దొకటి పరివారం చేసే దొకటి ఒకానొక వ్యాపార సంబంధ విషయంలో అనవసరంగా మాట పడవలసివస్తుంది పరుల చేత చిక్కిన ధనం అందటం గగనం అవుతుంది స్త్రీలకు వృత్తిలో ఆటంకాలు సంభవం, వహనం ఎంతైనా అవసరం

**♉ వృషభం** వ్యాపార సంబంధమైన స్పర్థను ఎదుర్కొనవలసిన పరిస్థితులు ఏర్పడుతాయి క్రయవిక్రయాలలో ఆశించిన ఫలితం అందదు అనవసరమైన పేచీలకు దారితీయవచ్చు, 'కాలం అనుకూలం కాని నాడు' ఎంతవారైనా యిబ్బందులకు గురికావలసిందే గదా! స్త్రీలకు ప్రతిభావ్యుత్పత్తులు ప్రకాశించే వారం

**♊ మిథునం** 'వారం వారం యింతేనా' అని, నిరాశ చెందవద్దు వ్యవహార జ్ఞానం సత్ఫలదాయకమవుతుంది రచనా విధానంలో లాభదాయకమైన పరిస్థితులు ఏర్పడుతాయి శుభకార్య సంభాషణల నిమిత్తం కొందరు చుట్టుపట్ల ప్రాంతాలకు ప్రయాణించగలుగుతారు స్త్రీలకు ధనలబ్ధి, కార్యానుకూలత సంభవం

**♋ కర్కాటకం** 'ఇతరులు బాగా ప్రగతి సాధించారు గదా!' అనిఅనుకోవటం న్యాయంగాదు, మీరు శ్రమించాలి తగిన ఫలం అందుకో గలుగుతారు వ్యాపారంలో నిరాటంకంగా ప్రగతిని సాధించగలరు పత్రికా ప్రకటనయందు గాని, రచనా విధానమందు గాని, మీ యభీష్టం నెరవేరుతుంది స్త్రీలకు ఉద్యోగ లాభం చేకూరుతుంది

**♌ సింహం** అవకాశవాదులను దరి చేర్పనీయకండి లభించిన ఆదాయాన్ని సద్వినియోగం చేసికోండి పత్రికా రంగంలో, రచనా విధానంలో అంతో యింతో ధనాదాయమున్నది వయోవృద్ధులకు ఆరోగ్య లోపం ఏర్పడటం గమసించగలరు స్త్రీలకు శ్రమకు తగినఫలం, ఆదాయం, ఆనందం, అనుకూలం చేకూరుతుంది

**♍ కన్య** దూరప్రాంతాలనుండి బంధువులో, మిత్రులో, పరిచితులోయింటికి రానున్నారు శుభకార్య ప్రస్తావనలు జరుగనున్నవి వృత్తిలో చాల మందికి మేలు జరుగుతుంది ఆరోగ్య విషయంలో కొందరు శ్రద్ధ వహించటం ఎంతైనా న్యాయం స్త్రీలకు వస్తు సేకరణకు, నూతన వస్త్రాలు సేకరించుకొనుటకు వారాంతం శుభదాయకమని గ్రహించాలి

**♎ తుల** భూసంపదను వృద్ధి నందించు మీ ప్రయత్నాలు సుకరంగా సాగిపోతాయి చాలకాలంగా నిలచిన ద్రవ్యం అందుతుంది అంతేగాక మీరు చేసే గృహ విస్తరణకు అప్పు అయినా అంది తీరుతుంది స్త్రీలకు విద్యా వైజ్ఞానిక రంగాలలో సదవకాశాలు లభిస్తాయి

**♏ వృశ్చికం** దూర ప్రాంతాలకు ప్రయాణం చేయాలనే సంకల్పం వారాంతంలో నెరవేరుతుంది క్రయవిక్రయాలలో అనుకూలత ఏర్పడుతుంది, గమనించాలి శ్రమకు తగిన ఫలితంఅందలేదని యిబ్బంది పడుతారు స్త్రీలకు ధన సంబంధమైన చిక్కులు, ఉద్యోగంలో మాట పట్టింపులకు అవకాశం గలవారం

**♐ ధనుస్సు** బంధు విరోధమో, మిత్రుల మూలంగా మాట పట్టింపులకో అవకాశమున్నది గమనించి మెలగండి ఒకానొక వ్యాపార విషయంలో సదవకాశం లభిస్తుంది భూములు కొనుగోలు చేయాలనే సంకల్పం, అంతతోనే ఆగిపోతుంది దేనికైనా 'ధన మూలం ఇదం జగత్' అనటం ప్రసిద్ధం గదా! స్త్రీలకు ఒకానొక విషయంలో అధికారుల మూలాన మేలు చేకూరుతుంది

**♑ మకరం** గమనించండి, వృత్తిలో పెంపు, ఉద్యోగంలో అనుకూలత, అంటే కొందరకు 'ప్రమోషన్ లభించటం గమనింపదగిన అంశం అప్రయత్నంగా ధనాదాయం చేకూరే అవకాశమున్నది వ్యవహార పరిష్కారంలో 'మీది పైచేయి' అనిపించుకొంటారు స్త్రీలకు గృహ సంబంధంగా చికాకులుంటాయి

**♒ కుంభం** శ్రమకొలది ఫలితం లభ్యం నూతన వ్యాపార యత్నాలు ఫలిస్తాయి అవకాశవాదులు చుట్టూ చేరుతారు, గమనించి మెలగండి బంధు విరోధం ఏర్పడకుండా చూచుకోండి ధనాదాయం లభిస్తుంది వ్యాపార రీత్యా అనుకూలవారంగా గ్రహించిమెలగండి స్త్రీలకు వృత్తిలో పెంపుగమనిస్తారు

**♓ మీనం** శ్రమకరమైన వారంగా కనిపిస్తుంది ఇందుకుతోడు ధనాభావం, మానశికంగా బాగలేకపోవటం, మిమ్ముల తికమక పెడుతుంది వయోవృద్ధులు అనారోగ్యతతో బాధ పడటం కూడా సంభవమే ఎంతో జాగరూకత వహించటం న్యాయం స్త్రీలకు అనవసరంగా బంధు విరోధం ఏర్పడటం, ఉద్యోగంలో సాటివారితో మాటపట్టింపులుండటం గమనిస్తారు ఏమైనా చికాకుకు ఆకరమైన వారమే

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

అసత్యానికి నోరు పెద్దది - అరుస్తుంది.
సత్యానికి గుండెగట్టిది - జయిస్తుంది.




# పద్మవ్యూహం

నిర్మాత: **మోహన్‌బాబు.యమ్.** దర్శకత్వం: **జి.సి.శేఖర్**

ఆంధ్ర: శ్రీ శాయి కంబైన్స్. నైజాం: శ్రీ శాయికృష్ణ. సీడెడ్: వీరబ్రహ్మేంద్ర

సీరియల్

# యక్షగానం

స్వర్గీయ

## శ్రీమతి మాదిరెడ్డి సులోచన

ఆదిత్య వింటున్నాడో లేదో తెలియదు అతను శివాజీరావింట్లో డైనింగ్ హాలు కిరువైపులా ఉన్న దీపపు సెమ్మెలు చూస్తున్నాడు

"ఆదిత్యా! నువ్వు అంతగా అభిమాన పడవల్సిందేంలేదు కాలం కలిసి రానప్పుడు ఎన్నో నిందలు నిష్ఠూరాలు ఎదుర్కోవాలి" అన్నాడు అతని బుజాలు పట్టి కుదుపుతూ

"అవును మీరు చెప్పిందంతా నిజమే కాని, దొంగన్న ముద్ర వేసుకుని ఎలా తలెత్తుకు తిరగను" అన్నాడు అతని గొంతులో బాధ గర గర లాడింది

"చూడు ఆదిత్యా! నీవు ఆలోచించినట్టే ఆలోచిస్తే, నేనీపాటికేం మిగలను! నాకు చిన్నప్పుడే తల్లిదండ్రులు పోయారు మహారాష్ట్రలో పుట్టి, హైద్రాబాద్ లో కొన్నాళ్ళు మా బాబాయితో ఉన్నాను బాబాయి ఇంట్లో పడిన కష్టాలు చెబితే నువ్వు అదిరి పోతావు ఆయన నల్గురు పిల్లలు విడిచిపెట్టిన అన్నం కలిపి పెట్టేవారు మొదట మొదట అభిమాన పడ్డాను, అసహ్యపడ్డాను కాని ఆకలి, బ్రతకాలన్న కాంక్షతో అన్నీ మరిచిపోయాను అది ఎంగిలా, విషమా అనే ఆలోచనే లేదు అది కడుపులోకి వెళ్తే చాలు అన్న ధోరణిలో మింగాను నాకున్న ఎస్సెట్స్ ఏమిటో తెలుసా! ఫస్ట్ మార్కులు"

(గత సంచిక తరువాయి)

"అబ్బా!" అన్నది నీలు

"అవును నీలూ! నా ఫస్ట్ మార్కులు భరించలేక, ఆ ఎంగిలి కూడు కూడా పెట్ట నన్నది నేను చేసేపని వందరూపాయలు ఆ రోజులలో ఇచ్చినా యెవ్వరూ చెయ్యరని మా అత్త తీసుకు వెళ్ళింది అక్కడ తిండి బట్టలు ఇచ్చారు ఇంటర్ పాసయి, మెడిసిన్ లో చేరాను అత్తకో విధవ కూతురుండేది ఆమె కోరికలు తీర్చాలి నన్ను నేను అమ్ముకోవాలి స్త్రీ పురుషుల కలియక క్రమబద్ధమైన సృష్టికార్య మయితే దానికో ఆనందం ఉంటుంది అనుభూతి ఉంటుంది ఏ అనుభూతి లేక ఆమె కోర్కె తీర్చే యంత్రంగా మారిపోయాను ఆమెను చూస్తే చలిజ్వరం వచ్చేది ఏం చేయాలో తోచేది కాదు పశువుకు నాకు తేడా లేదేమో అనిపించేది" అంటూ ఆగాడు శివాజి

"అబ్బా! చెప్పొద్దు డాక్టరుగారూ!"

"చెప్పనియ్యమ్మా ఆమె నుండి ఎలా తప్పించుకోవాలన్నదే నా తపన సాయంత్రం అయిందంటే ఏదో ఒక వంకతో బయట పడాలని కోరుకునేవాడని నేను ఎన్ని ఎత్తులువేసి బయట పడాలని చూసేవాడినో, ఆమె అన్ని ఎత్తులువేసి, నన్ను ఆపేది అత్తయ్య యింటికో స్మగ్లర్ వచ్చేవాడు లగన్ భాయి అని అతను నా అవస్త పసికట్టాడు

"ఈ శంకిణిని నువ్వేం భరిస్తావు! మాగిరాజులో ఉండి, వంటచేసుకో స్కాలర్ షిప్ వస్తుంది మా పిల్లల చదువు చూడు నేను కొంత ఇస్తాను" అన్నాడు సంతోషించాను అత్తయ్య ఇంట్లో నుండి బయటపడాలి ఆదే నా ధ్యేయం అందుకే లగన్ భాయి వెంట వెళ్ళాను" అన్నాడు అతను ఊపిరి పీల్చుకోవటానికి ఆగాడు

ఆదిత్య ఆసక్తిగా వింటున్నాడు ఒకనాడు ఎంగిలి కూడు తిన్న శివాజి, ఈ నాడు లక్షల కధికారి ఓ నర్సింగ్ హోమ్ కు ప్రొప్రయిటరు 'కృషితో నాస్తి దుర్భిక్షం' అన్న నానుడి నిజమే నేమో!

"చెప్పండంకుల్ ఓసారీ డాక్టరుగారూ!"

"నీలూ! నువ్వు అంకుల్ అన్నా, డాడీ అన్నా పలుకుతానమ్మా ఐ ఫీల్ ప్రౌడ్!" అన్నాడు శివాజి

అతని సహృదయతకు జోహార్లు అర్పించింది

"లగన్ భాయి నీడలో ఒక్క సంవత్సరం ఏ చీకుచింతా లేకుండా గడిపాను సాయంత్రాలు అతనిద్దరి పిల్లలకు పాఠాలు చెప్పి, నేను చదువు కునేవాడిని పూరి, లస్సీ, స్వీట్స్ అందేవి అవి వారికి ఉపాహారం నాకు మాత్రం ఆహారమే విధికి క్రూరంగా ఆటలాడుకోవటం సరదా ఒకనాడు ఆయనకు గుండె నొప్పి వచ్చి అకస్మాత్తుగా పోయారు అతని బావమరిదివచ్చి, భార్యా పిల్లలను తనతో తీసుకు వెళ్తానని, ఇల్లు అమ్మకానికి పెట్టాడు ఇల్లు కొనేవారికి నేను సంవత్సరాంతం వరకుంటానని చెప్పమన్నాను లగన్ భార్య అంగీకరించింది రూబీ, ఆమె భర్త వచ్చి దిగారు ఆ ఇంట్లో నా పరీక్షలయి మూడో సంవత్సరంలో అడుగు పెట్టాను

**జరిగిన కథ — 11.** ఇక తను ఆడే నాటకాన్ని విరమించాలని ప్రయత్నిస్తుంటుంది ముకుందాదేవి ముకుందాదేవి ఇంట్లో దోపిడి జరుగుతుంది తను ఇంతకాలం నాటకం ఆడి భక్తుల ముడుపుల ద్వారా సంపాదించిన సొమ్మును కొంచెం కూడా మిగల్చకుండా ఎత్తుకుపోతారు ముకుందాదేవి ఆదిత్యపై నేరం మోపి అరెస్ట్ చేయిస్తుంది చైనులూ, రాయుడూ కలసి ఈ దొంగతనం చేశారని నీలిమ చెప్పినా వినదు ఆ ఆస్తి కోసమే కాచుక్కూచున్న సావిత్రి తన కొడుకుతో వెళ్లిపోతుంది డాక్టర్ శివాజి ఇచ్చిన పేపర్ ప్రకటన చూసి అప్లికేషన్ పెట్టిన నీలిమను ఆహ్వానిస్తాడు శివాజి వారిరువురూ మాట్లాడుకొన్న తర్వాత గుళ్లో పెళ్లి చేసుకోవాలని నిర్ణయించుకొంటారు ఆదిత్య కేసు వాయిదా పడుతుంది నీలిమ తనకు పుట్టిన బిడ్డే అని ముకుందాదేవి ద్వారా తెల్సుకొంటాడు శివాజి ఆదిత్యను బెయిల్ మీద విడిపిస్తాడు నీలిమను ఆదిత్యకిచ్చి పెళ్లి చేయాలని నిర్ణయించుకొంటాడు

అప్పటికి కాని గరాజ్ ఖాళీ చేయాల్సి ఉందని గుర్తుకు రాలేదు బొంబాయిలో అపాటి అకామడేషన్ దొరకటం కష్టమే ఏం తోచలేదు రూబీ తెల్లగా, అందంగా గౌన్లు వేసుకుని

నా ప్రశ్న నా నోట్లోనే ఉండిపోయింది చేసేది లేక మెల్లగా అత్తయ్య ఇంటికి వెళ్లాను ఆమె ఇంటి ముందు జనం గుమిగూడి ఉన్నారు

''ఏమయింది ? '' అడిగాను

''కాపు పిచాచి, ఆ ఇంటామె కూతురు ఆ డ్రయివర్ గాడిని పొట్టన బెట్టుకుంది '' అన్నారు విరసనగా మా అత్త కూతురు డ్రైవరుతో అక్రమ సంబంధం పెట్టుకుందట

ఏమయిందో అతను ఆమెకు దూరం వెళ్లాడట ఆమె పిలిచింది ఇద్దరికి తీవ్ర వాగ్యుద్ధం జరిగిందట ఆమె నెట్టిందో, అతనే పడ్డాడో మేడమీద నుండి డ్రైవరు పడిపోయాడట తల్లీ, కూతుళ్లు పరారయ్యారట

వారి బంధువునని చెప్పుకున్నా, నా తల మీదికేం వస్తుందోనని, నేను వచ్చేసాను ఏం చేయాలి ! తెలిసిన వారందరిని అడిగాను



''గతిలేకపోతే డాక్టరీ చదువటం దేనికయ్యా· మా ఇంట్లో గుమాస్తా పని ఉంది చెయ్యి'' అని సలహా ఇచ్చారు

చివరి ప్రయత్నంగా రూబీ దగ్గరకే వెళ్లాను

తిరిగేది ఆమేనే ఏదైనా పని చూపమంటే, అని అడుగుదామని దగ్గరగా వెళ్లాను

''హల్లో జంటిల్‌మేన్ ! మీ పరీక్షలయిపోయాయనుకుంటాను '' అన్నది యెప్పుడు ఖాళీ చేస్తున్నావని డైరెక్ట్‌గా అడగలేదు

''మేము టౌయాటా కరోలా కొంటున్నాము గరాజ్ కావాలి'' అన్నది

"ఎస్ జంటిల్ మేన్ ! వ్వాట్ కెన్ అయి డూ ఫర్ యు ?"

కుక్కకు బిస్కట్లు తినిపిస్తూ అడిగింది

'మనిషిలా పుట్టేకంటే రూబీ ఇంట్లో కుక్కలా పుట్టటం నయమేమో' అనిపించింది

నా పరిస్థితి అంతా చెప్పాను

"నాకు చదువు మీరే చెప్పించారనుకుంటాను మీ కారు పెట్టుకొండి ప్రక్కనున్న కాస్త స్థలంలో సర్దుకుంటాను" అన్నాను

"మరి భోజనం !"

"ఎక్కడయినా ట్యూషన్స్ చూచుకుంటాను"

"ట్యూషన్స్ చేస్తూ చదువుకోవటం మాటలా ! నో నో నువ్వు నిశ్చింతగా చదువుకోవటానికి నేను ఏర్పాటు చేస్తాను నాకు అవసరం అయినప్పుడు నీ సహాయం కోరుతాను" అన్నదామె

"థాంక్యూ మేడమ్ నా ప్రాణం అయినా ఇస్తాను" అన్నాను

"ప్రాణం అక్కరలేదు నేను చెప్పినట్టు వింటే చాలు" అన్నది

ఆరునెలలు గడిచాయి నెల, నెల యాభై రూపాయలిచ్చేది రూబి ఆ యాభై రూపాయలు అప్పుడు పెద్ద మొత్తమే నిశ్చింతగా గడిచిపోయేది" అన్నాడు శివాజి

"ఆమె స్మగ్లింగ్ గ్యాంగ్ వ్యక్తేనా !" ఉత్సాహంగా అడిగాడు ఆదిత్య

"అంతకంటే గ్రంథ సాంగురాలు ఆమె మేల్ ప్రాస్టిట్యూషన్ ప్రవేశపెట్టిందనుకుంటాను చాలా గుట్టుగా జరిగేది ఆమె ఇంటికి వచ్చేవారంతా అందంగా, ఆరోగ్యంగా, దృఢంగా ఉన్న యువకులే"

"మైగాడ్ " అన్నది నీలిమ

"నా బస ఓ గదిలోకి మారింది మంచం, రెండు కుర్చీలు ఇచ్చింది ఒకరోజు నేను సీరియస్‌గా చదువుకుంటున్నాను రూబీవచ్చింది ఆమె నా దగ్గర కూర్చుని ఉపోద్ఘాతం లేకుండా అసలు విషయం చెప్పింది

"జంటిల్ మేన్ ! నా రుణం తీర్చుకుంటానన్నావు ఆ తరుణం ఆసన్నం అయింది డాక్టర్ చుగానీ సభియాటిస్ట్‌కు నీతో కాస్త పనిట వెళ్తావా !"

"తప్పకుండా మేడమ్" అన్నాను

"అతను చెప్పిన పని ఏదయినా నిరాకరించకు శివాజీ అయి నో యు కీప్ అప్ మై ప్రామీస్ "

"ఓ అలాగేనండీ " అన్నాను

తయారయి చుగాని ఇంటికి వెళ్ళాను అతను సాదరంగా ఆహ్వానించాడు అతనింటిని ఆనుకునే క్లినిక్ ఉంది అతను క్లినిక్‌కు అనుబంధంగా ఉన్న ఒక గది వైపు నడిచాడు ఆ

# యక్షగానం

గదిలో ఓ అందమైన అమాయకమైన అమ్మాయి నిలబడి ఉంది

"గుడ్ మార్నింగ్ సుమన్ !" అన్నాడు

ఆ అమ్మాయి నవ్వి ఊరుకుంది

"ఈ అమ్మాయి కీమధ్యే పెళ్లి అయింది శివాజీ భర్త నరాల బలహీనతతో బాధపడుతున్నాడు ఆమె అలా పిచ్చిగా చూస్తుంది జబ్బేం లేదు ఆమె వాంఛలను అణుచుకోవటానికి అలా చేస్తుందనిపిస్తుంది తల్లిదండ్రులు చాలా ఆందోళన పడుతున్నారు ఓ నాలుగయిదు రోజులు ఆమెతో గడిపితే రియాక్షన్ నాకర్థం అయిపోతుంది"

నాకు అర్థం అయింది ఆపనే స్త్రీ చేస్తే వేశ్యా వృత్తి అంటారు నాకు వేరే మార్గం లేదా ? ఏమిటి ? ఎంత కష్టమైనా నా డిగ్రీ పూర్తి చేయాలి

అదేనా దీక్ష ! ఒకసారి అత్త కూతురితో తిరిగినవాడికి మడి ఏమిటి ! నవ్వేసి ఊరుకున్నాను అలా నా జీవితం ప్రారంభం అయింది"

"వద్దండి ప్లీజ్ వద్దు " వినలేనట్టు తల విదిలించింది నీలిమ

"నీలూ ! ఇదివిని నువ్వు నాకు సానుభూతి చూపాలని కాదమ్మా ఒకొకరి జీవితంలో యెంత విషాదం, ఎంత కష్టసుఖాలుంటాయో తెలుసుకొమ్మని చెబుతున్నాను" అన్నాను

"సారీ సర్ ! మీ జీవితంలో ఇంత విషాదం ఉందని నాకు తెలియదు" అన్నాడు ఆదిత్య

ఇద్దరూ ఒకేసారి ఆయనవంక చూచారు

"నీలూ ! కొన్ని అభిమానాలకి, అనుబంధాలకి అర్థం చెప్పలేము అర్థాలు వెతకాలని ప్రయత్నించకు నేను చెప్పినట్టు విను నందనరావుగారి దగ్గర చనువుతో ప్రవర్తించినట్లే నన్ను అడుగు, ప్రశ్నించు "

"అలాగే " అన్నది అప్రయత్నంగా

ఇద్దరినీ సాగనంపాడు శివాజి అతని ముఖం చాలా గంభీరంగా ఉన్నది

నీలు ఆలోచిస్తున్నది ఇతను పూర్వాశ్రమములో తన తల్లికి క్లాసుమేటా ?

కాదు వయసులో ఎంతో వార ఉంది ఏమయి ఉంటుంది ! ఆమె ఊహించలేకపోయింది ఆదిత్యను అతని గదివరకు వెళ్ళి వదలి వచ్చింది

"నీలూ ! శివాజిగారివంతా మానవతా దృక్పథంతోనే చేసారంటారా !"

"నాకదే అర్థం కావటం లేదు "

ఇద్దరూ చాలాసేపు చర్చించారు

"నిశ్చింతగా నిదురపో మై డియర్ ఫ్రెండ్ " అన్నది, అతని చెయ్యి నొక్కుతూ

"థాంక్యూ " ఆమె చేయి చుంబించి వదిలాడు ఆమె వెళ్లి కార్లో కూర్చుని చిరునవ్వుతో చేయి ఊపింది

## 19

డిసెంబరు ముప్పై ఒకటవ తేదీ రాత్రి అది తెల్లవారితే కొత్త సంవత్సరానికి స్వాగతం పలుకుతూ, కేరింత కొడతారు యువ తరంగిణి మెంబర్లు అంతా యువతీ యువకులే ఈ రొటీన్ నుండి, ఆదిత్యను, నీలిమను తప్పించాలని శివాజి ప్రయత్నం అయిదు మాటపదహార్లు లైఫ్ మెంబర్‌షిప్ కట్టి, ఇద్దరిని యువ తరంగిణిలో చేర్చాడు

"ఈరోజు మీరు వెళ్లి హాయిగా డాన్స్ చేసి, పాటలు పాడి గడిపిరండి" అన్నాడాయన

"నాకు క్లబ్బులు, డాన్సులు అలవాటు లేదండి "

"మాకున్నాయనుకుంటున్నావా! ఈ రొటీన్ నుండి కాస్త బయటపడాలి కారు తీసుకు వెళ్తారా !"

"వద్దండీ ఆటోలో వెళ్లిరాగలం" అన్నారు ఆదిత్య, నీలిమ ఇద్దరూ బయటికి వచ్చారు

"యెలా ఉంది వ్యాపారం ?"

"చాలా ఫ్లరిషింగ్‌గా ఉంది జనంలో కూడుగుడ్డతోపాటు గూడు ఏర్పరుచుకోవాలన్న తపన కూడా బాగా పెరిగినట్టుంది ఎంత సెమెంటు తెచ్చినా, ఎంత బ్లాక్ చేసినా ఖర్చు అవుతూనే ఉంటుంది " అన్నాడు

"మనీ వాల్యూ తగ్గింది, వస్తువు ధరలు పెరిగాయి అంటున్నారు ' అన్నది ఇద్దరూ ఒక ఆటోరిక్షాలో కూర్చోవటం ఇదే మొదటిసారి ఇద్దరూ విచిత్రమైన భావనకు లోనయ్యారు అతని అణువణువు హాయి ననుభవించాయి అందుకేనా, జనం స్త్రీ పురుషుల సంబంధం కోసం అంతగా తపించిపోతారు

### ఆడే తల్లులు !

ఆసుపత్రులలో చికిత్స పొందుతున్న చిన్న పిల్లలు ఒంటరితనంతో బాధపడకూడదనే పశ్చిమ జర్మనీలో కొంతమంది తల్లుల పాత్రను నిర్వహిస్తున్నారు వీరిని 'ప్లే మదర్స్' అని అంటారు దీర్ఘకాలిక వ్యాధులతో బాధపడుతూ సంవత్సరాల తరబడి ఆసుపత్రులలోనే కాలం గడుపుతున్న ఈ పసి రోగులకు వీరు దేవతా మూర్తులవుతున్నారు వీరి తలిదండ్రులు వీరినే అంటిపెట్టుకుని ఉండటం తరచూ సాధ్యపడదు ఈ ప్లే మదర్స్ వారానికి మూడుసార్లు ఆసుపత్రికి వెళ్ళి ఈ పిల్లలతో కాస్సేపు ఆడుకుంటారు ఈ ప్లే మదర్స్ కార్యక్రమం 1977 లో ప్రారంభమైంది

హార్లిక్స్ మా కుటుంబంలో ప్రతి ఒక్కరికి మిత్రుడు వంటిది - రోజంతా ఆఫీసు పనితో అలసి వచ్చే మా శ్రీవారికి, కాలేజీకి, డాన్సు క్లాసుకి వెళ్ళివచ్చే మా అమ్మాయికి, ఫుట్‌బాల్ హీరో మా అబ్బాయికి. అంతెందుకు, రోజూ మార్కెట్ పని ముగించుకుని ఇంటికి వచ్చాక , నేను కూడా ఒక కప్పు హార్లిక్స్ త్రాగవలసిందే! హార్లిక్స్ మాలో ప్రతి ఒక్కరికి మేలు చేస్తుందని నా నమ్మకం.

మాల్టెడ్ బార్లీ, వెన్నతో కూడిన పాలు, బంగారు వన్నె గోధుమలలోని పోషక శక్తుల మంచితనమంతా చక్కగా రంగరించబడిన హార్లిక్స్ ఎంతో రుచికర మైన పానీయం.

పోషక శక్తిని సమకూర్చేందుకు ఉత్తమ మార్గంగా అందరు నమ్మకాడు. 100 సంవత్సరాలకు పైగా ప్రపంచమంతటా లక్షలాది కుటుంబాలు హార్లిక్స్‌ని నమ్ముకున్నాయంటే ఆశ్చర్యం ఏముంది?







మంచి పుష్టికరమైనది

HTD-HMM-8072 TEL

నీలిమకు అలాంటి భావం కల్గిందేమో దూరం జరిగి ఒక మూలకు ముడుచుకుని కూర్చుంది

"నీలా !"

"ఊఁ "

"ముహూర్తం ఎప్పుడు !"

"ఫిబ్రవరి నాల్గున అంటున్నారు అంకుల్ "

"అబ్బా ! అంతవరకు నీకు దూరంగా ఉండాలా !" అన్నాడు

వారి మాటల్లోనే ఆటో యువతరంగిణి క్లబ్బు ముందు వెళ్లి ఆగింది దాని సెక్రటరీ ఎదురువచ్చి ఆహ్వానించాడు అతను తెల్లగా, అందంగా ఉన్నాడు

"వెల్‌కమ్ వెల్‌కమ్ మిస్టర్ ఆదిత్యా, మిస్ నీలిమా !" అన్నాడు

"గుడ్ ఈవినింగ్ !" అన్నారు

"నా పేరు చంద్రబాబు" చేయి కలిపాడు అప్పటికే హాలు నిండుగా యువతీ, యువకులు గుమిగూడి ఉన్నారు

గౌన్ల వాళ్లు, మాక్సీల వాళ్లు, మినీలు వేసుకున్న యువతులు, ప్యాంట్లు షర్టులు వేసుకున్నవారు, పంజాబీ డ్రస్సులు వేసుకున్న వారు, చీరలు కట్టిన వారు, రకరకాల మనుషులున్నారు అక్కడ మినీ భారతదేశం చూచినట్టుంది

అలాగే యువకులలో ప్యాంట్లు, లూజ్ షర్టులు, పైజామాలు, రంగు, రంగుల లుంగీలు కట్టుకున్నారు

చంద్రబాబు తన టై సవరించుకుని, వేదిక నెక్కాడు

"లేడీస్ అండ్ జంటిల్ మెన్ !

ఈ సాయంత్రం మనది అంటే యువతీ యువకులది, నవత కోరే యువత సమతకోరే యువత నేడిక్కడ సమావేశం అయింది మనము

# యక్షగానం

కొత్త సంవత్సరానికి స్వాగతము పలుకుదాం సుస్వాగతం పలుకుదాం "

అతను కవిత్వం ధోరణిలో చెప్పుకు పోతున్నాడు మధ్య, మధ్య యువతీ యువకులు కేరింతలు కొట్టి నవ్వుతున్నారు

"వీళ్లు ఇంగ్లీషు క్యాలెండర్ ఎందుకు అనుసరిస్తారు !" అన్నది నీలిమ

"ఏది తెలుగుతనంతో కూడినది చెప్పు ! ఈ హాలా, వ్యక్తులా వారి వేష, భాషలా !" ఆదిత్య నవ్వాడు

"వెల్‌కమ్ వియ్ వెల్‌కమ్

న్యూ ఇయర్ ప్రాస్పరస్ ఇయర్ డియర్ " అంటూ ఇంగ్లీషు పాట మొదలు పెట్టారు

"కమాన్ ఫ్రెండ్స్ ! గివ్ యువర్ వాయిస్ ! జాయిన్ విత్ అస్ " చంద్రబాబు ఆహ్వానించాడు

అందరూ పాట అందుకున్నారు ఏడెనిమిది నిమషాలు స్వాగతం పలుకుతూ గడిపారు

"ఎనీపేర్స్ ! హూవాంట్ టు డాన్స్ !" చంద్రబాబు ప్రశ్నకు చాలా మంది యువతీ యువకులు లేచారు వాయిద్యానికి అనుగుణంగా డాన్స్ ప్రారంభం అయ్యింది

నీలిమ నుదుట పట్టిన చమట తుడుచుకుంది థాంక్స్, గాడ్ తనొక్కర్తే కాదు ఇంకా కొందరున్నారు అనుకుంది

ఆ డాన్స్ ముగిసింది అందరూ మిన్నుముట్టే చప్పట్లు కొట్టారు

"రిలాక్స్ ! అండ్‌హావ్ ఎ డ్రింక్" అన్నాడు

"కోల్డ్‌డ్రింకా ! హాటా !" అంటూ, బేరర్స్ అడిగి చక, చక సర్వ్ చేయటం మొదలు పెట్టారు

ఇటీవల విజయవాడ ఫ్రెండ్స్ కల్చరల్ అసోసియేషన్‌వారి ఆధ్వర్యంలో జరిగిన సాంస్కృతిక కార్యక్రమాలలో చక్కని ఇంద్రజాల ప్రదర్శన యిచ్చిన చి మురళీమనోహర్ (బి ఎస్‌సి మొదటి సంవత్సరం విద్యార్థి), సహాయకుడిగా ఉన్న అతని సోదరుడు చి రమణ (పదవతరగతి విద్యార్థి) లని చిత్రంలో చూడవచ్చు



"డ్రింక్స్ హాట్‌గా ఉంటాయా ! టీ, కాఫీ " అమాయకంగా అడిగింది నీలిమ

చిన్నగా నవ్వాడు ఆదిత్య

"బ్రాందీ, విస్కీ, కాక్‌టెల్ లాంటివి హాట్ డ్రింక్స్" అన్నాడు

ఉత్సాహానికి మారు పేరన్నట్టు, కోలాహలంగా తిరుగుతున్నారు యువతీ, యువకులు ! ఆ ప్రపంచమే వేరు అలాంటి ప్రపంచం ఉంటుందని కూడా తెలియదు నీలిమకు ఆమెకు కష్టాల వరవడిలో అనుభవం ఉన్నా శుభాలకు మాత్రం నోచుకోలేదు

ఇన్నిరకాల ఆనందాలు ఉంటాయని కూడా మరిచిపోయిందామె అదో విచిత్రమైన ప్రపంచం

కృష్ణకుంజ్ కొచ్చేవారంతా తమ కష్టాలను తీసుకుని, విచారంగా వస్తారు వారి ముందు తను అదృష్టవంతురాలిననే ధీమా ఉండేది నీలిమకు ఈ క్లబ్బులో అంతా యువతీ యువకులే వారిని చూస్తే తను వెదురు బొంగులమ్ముతూ ఏం పోగొట్టుకుందో అర్థం అయింది ఆమె కడుపులో తిప్పినట్టయింది

"ఆదిత్యా ! మనము వెళ్ళిపోదాం" అన్నది

"అప్పుడేనా !"

"ఈ వాతావరణం నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నది" అన్నది

"కొత్త సంవత్సరానికి స్వాగతం పలకాలి డియర్"

"పోదాం పద ఏమిటో ఇదంతా మరో లోకం" అన్నది లేస్తూ యెవరి సంతోషంలో వారున్నారు యెవరి ఆనందం వారిది వీళ్లను గమనించనేలేదు ఇద్దరూ బయటికి వచ్చారు

ట్యూబ్ లైట్ల కాంతి వెన్నెలలా పరుచుకుని ఆవరణంతా కల కలలాడింది అకస్మాత్తుగా ఆదిత్య వంక చూచింది అతని సైడ్ బర్న్స్ దగ్గర ఒకటి రెండు తెల్ల వెంట్రుకలు వెండిలా మెరిసాయి

"అప్పుడే తెల్ల వెంట్రుకలా !"

"మీ అమ్మగారి ప్రసాదం"

"మనిషి ఆలోచిస్తే తెల్ల వెంట్రుకలు వస్తాయి కదూ !" అన్నది ఆర్తిగా అతని నడుము చుట్టూ చేయి వేసి, తల అతని భుజానికి ఆనించింది

"ఊం "ఇద్దరూ బయటికివచ్చి, ఆటోను పిలిచారు ఆటో ఎక్కాక కూడా ఆమె ఏం మాట్లాడలేదు అతన్ని ఆనుకుని కూర్చుంది

"ఆదిత్యా ! డాక్టరుగారి కారిక్కడ పార్క్ చేసి ఉందేం ? ఆటో ! ఆపు" అన్నది ఆటోరిక్షా ఆగిపోయింది కృష్ణకుంజ్‌కు నాల్గిళ్ల అవతల శివాజి కారుంది

"నాన్నగారికి మళ్లీ సుస్తీ చేసిందో ఏమో " కంగారు పడింది







"అంత కంగారెందుకు! పద " అతని మాట వినపించుకోకుండానే నీలిమ పరుగున తన ఇంటి వైపు వెళ్లింది గేటు దగ్గరగా వేసి ఉంచి నెమ్మదిగా త్రోసింది ఆమె కళ్లు చురుకుగా పనిచేసాయి లతా మంటపము వైపు నుండి ఏడ్పు వినిపించింది .

ఎవరయి ఉంటారు అప్రయత్నంగా ఆమె కాళ్లు అటు వెళ్లాయి

"దేవీ దేవీ నువ్వు ఏడిస్తే నేను భరించలేను"

"నాకేం మిగిలింది చెప్పు నీతో గడిపిన ఆ కొద్ది రోజులు తప్ప నా జీవితంలో ఏం మిగిలింది!"

"ఇప్పుడేమయింది!"

చీకటిని చీల్చుకుని నీలిమ కళ్లు లతా మంటపంలోని వ్యక్తులను చూచాయి డాక్టర్ శివాజీ పైజమా, లాల్చీతో కూర్చున్నాడు అతని వడిలో తల పెట్టుకుని పడుకున్నది ముకుందాదేవి

కళ్లు చిట్లించి మరీ చూచింది నీలిమ

అతను ఆర్తిగా ఆమె బుగ్గ చుంబించి తల నిమురుతున్నాడు

"చక్రీ చక్రీ! ఈ సాంప్రదాయాలకు సభ్య సమాజానికి దూరంగా తీసుకు వెళ్లు నేనీ నరకంలో ఉండలేను"

"దేవీ! ఇప్పుడు మనము ఆలోచించేది మన గురించి కాదు మన పిల్లల గురించి" అన్నాడు అతను

"ఎన్నాళ్ళీ దొంగ బ్రతుకు!"

అతని నుండి గాఢమైన నిట్టూర్పు వెలువడింది

ఆటో వాడికి డబ్బులిచ్చి వచ్చిన ఆదిత్య ఇటు చూడలేదు సరాసరి ఇంటికి వెళ్లి బెల్ కొట్టాడు

ఆ బెల్ శబ్దానికి, సన్నగా వినిపించినా ముకుందాదేవి, శివాజి ఉలిక్కిపడి లేచారు ఎదురుగా నీలిమను చూచి, కాళ్లు భూమిలోకి పాతుకుపోయినట్టు ఆగిపోయారు

"నీ నీలూ" శివాజియే తేరుకున్నాడు

"నన్నా పేరుతో పిలువవద్దు ప్లీజ్" గిరుక్కున తిరిగి ఇంటివైపు పరుగెత్తింది 'నీలూ! నీలూ' అంటూ శివాజి ముందుకు వచ్చాడు

"చక్రీ! నువ్విప్పుడెళ్లిపో నిన్నది అవమానిస్తే నేను భరించలేను" అన్నదామె

ఇద్దరు ఇంటిముందుకి వచ్చారు ఇంటి ముందు వరండాలో కూర్చుని వెక్కి వెక్కి ఏడుస్తుంది, నీలిమ

"నీలూ! ఏమయింది?" ఆదిత్య అడుగుతున్నాడు

"ఆదిత్యా! చాలాసేపయింది వెళ్దాం పద" శివాజి పిలవగానే ఆదిత్య తల పంకించి అతడిని అనుసరించాడు

ముకుందాదేవి వణుకుతున్న చేతులతో ఇంటి తాళం తీసింది నీలిమ లేచి లోపలికి వెళ్ళింది వరండాలో అన్నీ మరిచి నిదురమాత్ర ప్రభావంతో నిశ్చలంగా నిదురబోతున్న నందనరావును చూడగానే తల్లిపై రెట్టింపు అసహ్యము, తండ్రిపై జాలి, గౌరవము కలిగాయి

"నాన్నా!" అతని మంచం దగ్గర కూర్చుని బావురుమన్నది నీలిమ తల్లి వంచకి, తండ్రిని మోసం చేసింది తన మలినమైన చరిత్ర బయట పడరాదని, ఎంత నాటకం ఆడింది దేవుడయి వెలిసింది

అందుకే అన్నారేమో, రంకు నేర్చిన స్త్రీ బొంకు నేరుస్తుందని

నిజాయితీగా నువ్వు నాకొద్దు నీ వల్ల నా కోరికలు తీరటం లేదని చెబితే ఏం? ఈ దొంగ బ్రతుకెందుకు! ఆమె అలాగే కూర్చుంది ముకుందాదేవి మాట్లాడక, తలుపు లోపలినుండి బోల్ట్ వేసి వెళ్లిపోయింది తనను పలుకరించే ధైర్యం యెక్కడిది అనుకుంది నీలిమ!

'నా బ్రతుకు ఇలాంటిదని చెబితే ఏం పోయింది!' ఆమె అలా ఏడుస్తూ ఎంతసేపు కూర్చుందో ఆమెకే తెలియదు తనే పిచ్చిది తనమీది ప్రేమచేత ఏదో అంటుందని భ్రమ పడింది

అంతా మోసం! అంతా దగా! అంతా వేషం!

నాల్గు గంటలు కొట్టిందికూడా వినిపించుకోలేదు

నందనరావు మేలుకునే సమయమది అతను, అటు, ఇటు దొర్లాడు

"నాన్నా!" ఉలిక్కిపడింది

"నువ్వు నువ్వింకా నిదురపోలేదా తల్లీ"

"లేదు నాన్నా!"

"కొత్త సంవత్సరం ఫంక్షన్ ఏదో ఉందన్నది మీ అమ్మ"

"అక్కడనుండే వస్తున్నాను"

"ఫంక్షన్ బాగా జరిగిందా!"

"ఊఁ" అన్నది యెటో చూస్తూ

"మంచి నీళ్లిచ్చి పడుకో" అన్నాడు

మెల్లగా నీరసంగా లేచింది నీలిమ వంటింట్లోకి వెళ్లి మంచినీళ్లు తెచ్చి ఇచ్చింది అతని చేత త్రాగించి, అతను త్రాగాక, తల్లి గదిలోకి తొంగి చూడబోయింది ఈ మధ్య ఇల్లు అద్దెకిచ్చాక, వరండాలో నందనరావు, విగ్రహాలున్న గదిలో ముకుందాదేవి పడుకుంటున్నారు ఉన్న ఒక్కగానొక్క గదే నీలిమది కాని ఆమెకా క్షణంలో తల్లిని చూడాలనిపించలేదు అందుకే వెళ్లి ముసుగుతన్ని పడుకుంది ఆలోచించి అలసిపోయిన మెదడు నిదురపోయింది

**(ఇంకా వుంది)**




# మనకు కనపడే నక్షత్రాలు

## శ్రీ జయంతి ధర్మతేజ్

మన కళ్లకు కనబడే నక్షత్రాలు ఆకాశంలో 3 వేలకు మించి, నాలుగు వేలకులోగా ఉంటాయి ఈ నక్షత్రాలుకూడ, శీతాకాలం నుండి వర్షాకాలం కొసవరకూ, ఆకాశంలో మారుతూ వస్తాయి ఒకే రాత్రిలో 10గంటల రాత్రికి కనిపించేవి, 3 గంటల రాత్రికి కనబడవు అంటే నక్షత్రాలుకూడా సూర్యుడిలాగే ఉదయిస్తాయి అస్తమిస్తాయి, భూమి గిర్రున బొంగరంలాగా తిరుగుతూ ఉంటుందికనక అందుచేత సంవత్సరం అంతా, అన్ని రాత్రులూ, నువ్వు కనిపెట్టుకొని కూర్చుంటేతప్ప,ఆకాశంలో మన దృష్టికి ఆనే 4 వేల నక్షత్రాలనూ చూడలేవు ఇంత ఓపికతోనూ చూసేవాళ్లు ఉన్నారు ప్రపంచంలో వాళ్లను జ్యోతిశ్శాస్త్రజ్ఞులు అంటారు

ఏడాదిలో ఏ మాసంలోనైనాసరే, ఆకాశం నిర్మలంగా ఉన్నప్పుడు ఉత్తర దిక్కుకు చూసేవంటే, నాగలికొర్రు రూపంలో నక్షత్రలోకాల్ని దున్నుతూ ప్రకాశిస్తున్న ఏడు చుక్కల్లాగా సప్తమహర్షులు కనబడతారు వారిని పలకరించి, వారిని అడిగి గుర్తులు తెలిసికొని, మరికొన్ని నక్షత్రమండలాలతో పరిచయం చేసుకుందాం ఈ సప్తర్షిమండలం ఇప్పటికి 4, 5 వేల ఏళ్ల క్రితమే మనుష్యులకు గుర్తు ఉందని చరిత్ర చెబుతుంది ఈ ఏడు నక్షత్రాలలో ఒక దానిని అంటిపెట్టుకొనిఉన్న వసిష్ఠుని భార్య, పతివ్రత, అరుంధతి నక్షత్రాన్ని పెళ్లికూతురుకు పురోహితుడు చూపిస్తాడు సప్తర్షి మండలాన్నే ఆంగ్ల భాషలో, గ్రేటుబేరు (పెద్ద ఎలుగుబంటి), ఛార్లెస్ వేన్ ది ప్లో (నాగలి) అని పిలుస్తారు ఈ మండలంలో నలుచదరాకారంలో ఉన్న చుక్కల్లో కొన రెండింటిద్వారా ఒక గీత గీసి, దాన్ని క్రిందికి పొడిగిస్తే, ఆ గీత ధ్రువతారలోగుండా పోతుంది ధ్రువుడి కథా, తండ్రి ఉత్తానపాదుడూ, సవితతల్లి సురుచి, ధ్రువుడు అవమానింపబడి అడవులకుపోయి, తపస్సుచేసి, ధ్రువ నక్షత్రంగా మారిపోయి అందరికీ మార్గదర్శిగా ఉండడం మీకు తెలిసే ఉంటుంది ఈ కథ భాగవతంలోనిది అయితే ధ్రువతార మాత్రం ఎల్లప్పుడు నిశ్చలంగా, ఒక చోటున, ఉత్తర దిక్కున స్థిరంగా ఉంటుంది ఈ చుక్కను చూస్తూనిలుస్తే, నీ వెడమ చెయ్యి పశ్చిమాన్ని, కుడిచెయ్యి తూర్పుని, నీ వెనుకవైపు దక్షిణాన్ని చూపుతాయి ఈ విధంగానే రాత్రి పెను చీకటిలో, బాటసారులు, యాత్రలు పోయేవారు, సముద్రంలో ఓడల్లో ప్రయాణించేవారు, నావికులు, దిక్కులు తెలుసుకొని, ముందుకు వెళ్లేవారు పూర్వపు రోజుల్లో ఇప్పుడు దిక్కులు చూపడానికి ఎన్నో రకాల యంత్రాలు నిర్మించారు వాటినిగురించి ముందు ముందు చెప్పుకుందాం ఆకాశం ఉత్తర భాగంలో ఉన్న నక్షత్రాలన్నీ ధ్రువతార చుట్టూ ప్రతి 24 గంటల్లో ఒకసారి, ప్రదక్షిణం చేస్తున్నట్టు కనబడతాయి

ధ్రువతార, లిటిల్ బేర్ (చిన్న ఎలుగుబంటి) అనగా లఘు సప్తర్షి మండలంలోని ఒక నక్షత్రం ఈ లఘు సప్తర్షిమండలం నాగలి కన్నా చాలా చిన్నది అయితే ఈ రెండు సప్తర్షి మండలాల గురించి, గ్రీకు దేశంలో చక్కని కథ చెబుతారు పూర్వం కాలిస్టో అను వనకన్య ఉండేదనీ, దేవతలందరిలో మొనగాడైన జ్యూపిటరు దేవుడు ఆ కన్యను ప్రేమించగా, ఆవిడకు ఒక కొడుకు పుట్టాడనీ, దాంతో జ్యూపిటరు భార్య జూనోకు కోపం వచ్చి, కాలిస్టోను, ఆమె బిడ్డను, ఎలుగుబంట్లుగా చేసేసిందనీ తరువాత ఆ రెండు ఎలుగుబంట్లను జ్యూపిటరు ఆకాశంలో తార మండలాలుగా మార్చాడుట

పెద్ద ఎలుగుబంటి తోకకు ముందున్న చుక్కనూ, ధ్రువతారనూ కలిపి గీతగీసి ఆ గీతను పొడిగిస్తే, దూరంలో ఆకాశంలో అవతలవేపున ఆ గీతనుబట్టి 5 చుక్కలు, డబ్ల్యు అక్షరంలాగా ఉన్న కాసియోపియా అనగా, శర్మిష్ఠ మండలానికి వస్తాం ఈ మండలాన్నే ఆకారాన్నిబట్టి శర్మిష్ఠ సింహాసనం, ఉయ్యాల అంటారు గ్రీకుదేశంలో, కాసియోపియా, ఆమె కూతురు ఎన్డ్రొమిడా గురించి, యోధుడు పెర్సూసును గురించి ఒక చక్కని కథ ఉంది చదువుకోండి శర్మిష్ఠను దాటిపోతే రెక్కల గుర్రం, పెగాసస్ లేక ఉచ్చైశ్రవం మండలానికి వస్తాం దానిపైన ఎన్డ్రోమిడా లేక దేవయాని మండలానికి వస్తాం దేవయానిని పెళ్లాడిన యయాతిమండలం, ఆ చుక్కలతో కూడినది ఆ పైనే ఉంది శుక్రుడు, శర్మిష్ఠ, కూతురు దేవయాని, యయాతి ఆవిడను పెండ్లాడటం ఆ కథ నీకు తెలిసే ఉంటుంది దేవయాని మండలంలో మూడు చక్కని చుక్కలున్నాయి

యయాతి మండలంక్రిందే, కనబడీ కనపడకుండా ఉన్న కృత్తికా పుంజం అన్న తారామండలం ఉంది దీన్ని ఆంగ్లంలో ప్లెయిడ్సు అను 7 గురు కన్యలు అంటారు భూమిని అట్లాసు అను రాక్షసుడు తన భుజాల మీద మోస్తూ ఉంటాడని, వాని కూతుళ్లు ఈ 7 గురు కన్యలు అని గ్రీకు కథలు చెబుతాయి వారు అడవిలో ఆడుకుంటూ ఉంటే, ఒరియను



అను వేటకాడు చూసి మోహించి వెంటపడ్డాడని, వాని బారి నుండి తప్పించేందుకని, ఒక దేవత వాళ్లను చుక్కలుగా మార్చేసిందని చెబుతారు కాని ఈ చుక్కల్లో ఒక చుక్క మాత్రం కనబడదు గ్రీకులు ట్రాయి నగరాన్ని మంట పెట్టేసినప్పుడు, విచారంతో ఆ ఏ డో క న్య కనిపించకుండా పోయిందంటారు

వేటకాడు అయిన ఒరియను కూడా పశ్చిమదిశలో ఆకాశంలో జనవరి నుండి జూను వరకు రోజూ కనబడతాడు ఈ మండలంలో చుట్టూ చతుర్భుజాకారంలో 4 పెద్దచుక్కలూ, మధ్యను మూడు చుక్కలూ, వాటి క్రిందను ఇంకో చుక్కల రాసి ఉంటాయి మధ్యచుక్కలను ఒరియను నడుంపటికా అంటారు ఈ మండలాన్నే మనం మృగశీర్షం అంటాం మండలాన్ని అంటిపెట్టుకొనే ఉంటుంది, సిరియను అను తార దీన్ని మృగవ్యాధుడు అంటాం అన్ని చుక్కల్లోనూ మరీ ప్రకాశవంతమైనది ఈ తార దీన్ని డాగ్ స్టార్ వేటకాడి కుక్క అంటారు విదేశీయులు ఈ మృగవ్యాధ్యుడు గ్రేట్ డాగ్, లేక విశ్వతారా మండలంలో ఒక చుక్క

సప్తర్షి మండలాన్ని అనుసరించిపోతే, స్వాతి నక్షత్రాన్ని కూడా చూస్తాం అయినా ఇంతమందితో ఒక్కసారి పరిచయం చేసుకుంటే విసుగు పుడుతుంది గనక ఇంక ఆపేద్దాం

అయితే ఇన్ని చుక్కల్ని చూసేంకదా, అసలు చుక్కలంటే ఏమిటి అని ప్రశ్నిస్తారేమో? అన్ని నక్షత్రాలూ మన సూర్యుడు లాంటి సూర్యులే అని మొదటే చెప్పాను నిర్మలా కాశంలో నక్షత్రాలే కాకుండా, మధ్య మధ్యను మసకమసకగా మబ్బులు, పాలదారి కూడా కనబడతాయి మబ్బులాగా ఉన్న పాలదారి మిగతావి కూడా నక్షత్రమేఘాలైన నీహారికలు (నెబ్యులాస్) ఈ నీహారికలు, నక్షత్రాలు తయారయ్యే కర్మాగారాలు అని శాస్త్రజ్ఞులు చెబుతారు ఆకాశంలో కనబడే పాలదారి కూడా ఒక నీహారికే దేవయాని మండలంలో చాలా పెద్ద నీహారిక ఉంది ఈ నక్షత్ర మేఘాలు తమలో తాము పాము చుట్టల రూపంలో, విష్ణు చక్రంలాగా తిరుగుతూ ఉంటాయి' అలా తిరగడంవల్ల ఆ మేఘాల్లో ఉన్న పదార్థం గట్టిపడి నక్షత్రాలుగా మారుతుంది పాలదారి అనబడే నీహారిక, పాముచుట్ట రూపంలో ఉన్న తోకలో, సూర్యుడు ఒక చుక్క మాత్రమే ★

**ఆంధ్రపత్రిక**
**1947 సెప్టెంబరు 17**
**పంచిక నుంచి**

# దూరం

'స్మిత'




రాజారావ్ అంత తొందరగా ఇంటికి వస్తాడని ఎవరూ అనుకోలేదు అందుకే ఇంట్లో అతని ప్రమేయంలేకుండా జరిగే కార్యక్రమాలు యధావిధిగా జరిగిపోతున్నాయి

రాజారావ్ ఇంట్లో అడుగుపెట్టేసరికి సంగీత గదిలోంచి గజ్జెల శబ్దం వినిపించింది "పాప డాన్స్ ప్రాక్టీస్ చేస్తున్నట్టుంది" అనుకున్నాడు అలా అనుకునేసరికి గుర్తొచ్చింది — పాప డాన్స్‌చూసి చాలా రోజులు ఛ ఛ చాలా సంవత్సరాలైందని, కనీసం స్కూల్ ఫంక్షన్స్‌కిగాని — కాలేజి ఫంక్షన్స్‌కిగాని అటెండ్ అవలేదని

మనసు గిల్టీగా ఫీలైంది నెమ్మదిగా కర్టెన్ తొలగించి చూసాడు — వీధి తలుపు వైపుంచి టేప్ రికార్డర్‌లో వస్తున్న తాళాని కనుగుణంగా డాన్స్ చేస్తోంది సంగీత

శబ్దం కాకుండా వెనక్కు తిరిగాడు శ్రీను గది తలుపులు బార్లా తీసి వున్నాయి చుట్టూ పుస్తకాల మధ్య బయటి ప్రపంచంతో సంబంధం లేనట్లుగా — లీనమై వున్నాడు మెడిసిన్ సెకండియర్ చదువుతున్న కొడుకు డిస్టర్బ్ చెయ్యలేక వెనక్కు తిరిగాడు

బెడ్‌రూమ్‌లోకి అడుగు పెట్టిన రాజారావ్ మరో ప్రపంచంలోకి వచ్చినట్లు — దిమ్మెరపోయాడు

డిమ్‌లైట్‌లో నీలంగా మెరుస్తోంది గది

చాలా మంద్రంగా వినిపిస్తోంది—చిట్టిబాబు వీణ కళ్ళు డిమ్‌లైట్‌కి అలవాటు పడ్డాక గాని గమనించలేదు— ఈజీ చెయిర్‌లో వెనక్కివాలి వున్న సుజాతని

సుజాతని చూడగానే అప్రయత్నంగానే అడుగు వెనక్కు పడింది

చేతిలో కర్టెన్ జారిపోయింది

కర్టెన్ కిందంచున ఉన్న గజ్జెలు ఘల్లుమన్నాయి ఉలిక్కిపడి తలెత్తింది సుజాత

"మీరా ?"

రాజారావ్ లోపలికి వెళ్ళాడు

ట్యూబ్‌లైట్ గుప్పున వెలిగింది

సుజాత కళ్ళు తడిసిన మందారాల్లా చప్పున లేచి వంటగదిలోకి వెళ్ళింది సుజాత

రాజారావ్ కళ్ళు అప్రయత్నంగానే గదిని వెతికాయి

గోడల మీద అక్కడక్కడ పెయింటింగ్స్— సుజాత వేసినవే

ఏదో సన్నటి వాసన చాలా సేపటికి గాని గమనించలేదు ఆ వాసన మంచి గంధంతో చేసిన వేలెండంత రాధాకృష్ణుల బొమ్మదని

సుజాత కాఫీ పట్టుకు రావడంతో తల తిప్పాడు ప్రయత్న పూర్వకంగా పెదవుల మీదకు చిర్నవు తెచ్చుకున్నాడు

"ఇంకా ఆరైనా అవలేదు అప్పుడే చీకటి పడిపోయింది" కాఫీ అందుకుంటూ అన్నాడు రాజారావ్

"శీతాకాలం గదా" జవాబుగా అంది సుజాత

అప్రయత్నంగా సుజాత పెదవులమీద చిన్న చిర్నవ్వు ఇరవై సంవత్సరాల క్రిందటి జ్ఞాపకాలు కదిలాయి పెళ్ళైన కొత్తలో —

సరిగ్గా ఇవే మాటలు ఆ తరువాత—

"మరింకేం తలుపులు వేసెయ్ — ఎవరు తలుపు కొట్టినా మళ్ళీ రేప్పొద్దుటి వరకు తియ్యొద్దు" అనేవాడు

రాజారావ్ కళ్ళలో ఆ జ్ఞాపకాల కోసం వ్యర్థంగా వెతుక్కుంది సుజాత

"ఇంకా టైముంది పిక్చర్‌కి వెళ్దామా ?"

"ఇప్పుడా పాపకి ఎల్లుండి డాన్స్ కాంపిటీషన్ బాబుకి నాలుగు రోజుల్లో ఎగ్జామ్స్ "

రాజారావ్ అసహనంగా తల విదిలించాడు

"పోనీ మనిద్దరం వెళ్దాం "

"ఆ అన్నీ చెత్త సినిమాలు ఏం చూస్తాం" పెదవి విరిచింది సుజాత

రాజారావ్ విసురుగా లేచి నిల్చున్నాడు

"అవును ఎందుకొస్తావ్ ? అసలు నాతో సినిమాకి రావటం ఇష్టం లేదనరాదూ — మీ లోకం మీది నాతో పనేమిటి " సుజాత ఏదో చెప్పబోయేలోగానే బయటకు వెళ్ళిపోయాడు

రెండు నిమిషాల్లో స్కూటర్ స్టార్టయింది

* * *

సెకండ్ షో సినిమా చూసి — ఇంటికి వచ్చాడు రాజారావ్ కాలింగ్ బెల్ వింటూనే ఇంకా చదువుకుంటున్న శ్రీను వచ్చి తలుపు తీసాడు

"ఇంకా పడుకోలేదా ? చాలా లేటైంది పడుకో పొద్దున లేచి చదువుదువుగాని "

గీజర్లో వేణ్ణీళ్ళతో స్నానం ముగించి — డైనింగ్ టేబుల్ దగ్గరకొచ్చాడు

ఆకలి — విపరీతమైన ఆకలిగా వుంది

బోర్లించిపెట్టిన కంచం తీసాడు

దానికింద ఓ కాగితం నాలుగు మడతల్తో కంచం పక్కనుంచేసి కాగితం అందుకున్నాడు

# ప్రేమ్ సబ్బుతో స్నానం
# రోజంతా ఉల్లాసం

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చి సహజ
సౌందర్యమును పెంపొందించు సబ్బు ప్రేమ్.
దీని స్వచ్ఛమైన నురగ, పరిమళము
మీ మనసును పులకింపజేయును.




గులాబి మఱియు ఆకుపచ్చ
రంగులలో లభించును



జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ

Imageads M 1783

# దూరం

ప్రియం. ...న ఆర్ (రౌడీ)కి —

బహుశా ఈ పిలుపైనా మీలో సమాధి అయిపోయిన జ్ఞాపకాల్ని తట్టి లేపుతుందా — గుర్తు చెయ్యనా — పెళ్ళి కాకముందు — నా ఇనీషియల్ డి అంటే దేవత అని మీరు వ్రాసినప్పుడు మీ ఇనీషియల్ ఆర్ కి — రౌడీ అని చెప్పానని — చాలా ఏళ్ళు మీకు ఉత్తరం అంటూ వ్రాస్తే అలాగే వ్రాసేదాన్ననీ —

సాంప్రదాయాల్ని కాదని—తల్లిదండ్రుల్ని కాదని — చివరికి సంఘం కట్టుబాట్లైన కులమతాల్ని కాదని — మీకోసం కట్టుబట్టల్తో వచ్చేసాను — అందుకోసం ఏ రోజూ బాధపడలేదు శ్రీవారూ – కాని నేను చేసిందేమిటి –

నా ఆశల్ని – నా ఆయయాల్ని — నా కలల్ని అన్నీ మీ చుట్టూనే అల్లుకున్నాను

చివరికి మీ వుపిరికే నా వుపిరి అనుకున్నాను కాని ఏ రోజూ అనుకోలేదు— నా కలల్ని— నన్ను ఒక్క తోపుతోసి మీ లోకం మీరు ఏర్పరచుకుంటారని నిజమే— మీకు నేనూ, నాకు మీరూ కావాలనుకోవడం వల్ల మా వాళ్లకు మీరూ మీ వాళ్ళకు నేనూ పనికిరాని వాళ్ళ మయాము అన్ని పరిణామాలూ ఆలోచించే కదా మనం ఒకరి కొకరం కావాలనుకున్నది నిజమే మీలాగే నేనూ ఎదురుచూసాను కనీసం పిల్లల్ని చూసైనా మారకపోతారా అని కాని పెద్దవాళ్ళకు కావలసింది — డబ్బూ — సాంప్రదాయాలే కాని మనసులూ— మనుషులూ కాదని తెలిసి వచ్చింది

అంతమాత్రాన అంత బాధపడి మిమ్మల్ని మీరు మరచిపోవాలని ప్రయత్నించాలా —

ఆ ప్రయత్నంలో ఒక్కక్షణం— నా గురించి ఆలోచించారా — మీలాగే — మీరే ఆధారంగా — మరో ప్రాణి వుందనైనా గమనించారా ? కనీసం పిల్లల్నైనా చేరదీసారా ? నాకు నేను ఎంత తల్లడిల్లిపోయానో ఏం తెలుసు మీకు ? కనీసం ఆలోచనల్ని తప్పుకుందుకు ఏ చెత్త సినిమా అయినా చూడాలనుకున్నరోజున మీరు ఎన్ని గంటలకు యింటికి వచ్చేవారు — గత పదేళ్ళుగా మీ టైమ్స్ ఫిక్స్‌డ్ అయిపోయాయి పొద్దున తొమ్మిదింటికి భోజనంచేసి వెళ్తే రాత్రి క్లబ్‌కివెళ్ళి తిరిగి వచ్చేది రెండు గంటలకు ఆ మగతలో ఆ మత్తులో మీకోసం కళ్ళు కాయలు కాసేలా ఎదురుచూసే నేనున్నానని మీకసలు గుర్తుండేదా ? మళ్ళీ పొద్దున ఎనిమిదింటికి నిద్రలేస్తే తొమ్మిదింటికి వెళ్ళిపోవడం —

ఇదేనా నేను మీనించి ఆశించినది ? దీని కోసమేనా మీరు తప్ప మిగతా వారినందరినీ త్యజించినదీ —

ఏదైనా అడిగితే విసుగూ — పోట్లాట — మనసు విరిగిపోవడం — అంతేకాని మరేదైనా ఫలితం దక్కిందా ?

మీ మాటల్లో—మీరన్నట్టుగా—మీ జీవితంలో నేనుతప్ప మరెవరూ లేరు—ఉండరు వచ్చే జీతం తెచ్చి నా మొహాన్న పారేస్తున్నారు

కాని శ్రీవారూ—మీ మనసుకు తెలియదా ? మీ ఉద్యోగాన్ని చూసి నేను ప్రేమించలేదు — మీరు తెచ్చి పారేసే జీతం రాళ్ళు నేను సాంపాదించుకోలేనా ?

నేను చాలా అల్ప సంతోషిని నావి చాలా చిన్న కోరికలు కాని అవికూడా తీర్చుకోలేక పోతున్నాను ప్చ్ దురదృష్టం పెళ్ళికాక ముందు ఆ ఆర్నెల్లూ సినిమాకు వెళ్దామనీ — షికార్లకెళ్దామనీ వేధించేవారు గుర్తుందా

నేను కూడా ఆశించాను పెళ్ళైనాక బయటకంటూ వెడితే మీ తోటే వెళ్లాలని, సినిమా చూస్తే మీతోటే చూడాలనీ, గుడికి వెళ్తే మీరూ—నేనే వెళ్ళాలనీ—

## ఆదర్శం

చిన్నా పెద్ద
ధనిక బీద
ఆడ మగ
దొంగ దొర
ఎవరొచ్చినా
చేతులు చాపి
స్వాగతం పలికి
నీడ నిస్తున్న
చెట్టు — చేమా
జీవితాలు
సమానత్వానికి
ప్రత్యక్ష నిదర్శనాలు

— మాధవరపు కృష్ణ

ఇవన్నీ, అనుక్షణం మీరు నా పక్కన, నాతో నా మనసుతో ఒకటైపోవాలనే

మీకు తెలుసా — కనీసం ఈ ఇరవై రెండేళ్ళలోనైనా గ్రహించగలిగారా— మంచినీళ్ల తాగినా మీతోపాటే తాగాలని నా మనసు కోరుకుంటుందని—

సాయంత్రం మీరు వచ్చాకే ఇద్దరం టీ తాగేవాళ్లం ఆ సంగతి మీకూ తెలుసు అయినా మీ అలవాట్లు మారి మీ కోసం చూసి చూసి ఆ అలవాటు మానేసుకున్నానని తెలుసా ? ఎప్పుడైనా అడిగారా? రాత్రి ఏకంగా రెండింటికి వచ్చి భోజనం చెయ్యలేదని కోపగించుకునేవారే గాని— నా కోసం ముందు ఇంటికి రాగలిగారా ?

"తింటే తిను లేకపోతే లేదు" అని మీరేనా అనగలిగింది ? పదేళ్లుగా రాత్రి భోజనం మానేసానని తెలుసా మీకు

సారీ ! ఆవేశపడి పోతున్నానా ఉహు ఆవేశపడి రాత్రంతా నిద్ర మాని బ్లడ్‌ప్రెషర్ రైజయిన రోజులన్నీ గడిచిపోయాయి

చాలా రోజులు నన్ను నేను ఎనలైజ్ చేసుకుని మరీ ఆలోచించాను బహుశా నా చుట్టూ మిమ్మల్ని (పెళ్ళి కాకముందు రెండేళ్ళు) తిప్పుకున్న లక్షణమేదో నాలో హరించి పోయిందేమోనని (ప్రతి క్షణం ప్రతి నిమిషం నా గురించే మీ ఆలోచనలని మీరు వ్రాసుకున్న డైరీ భద్రంగా తెలియజెప్పింది )

మీరంటూ వుంటే నాకోసమేననికూడా వ్రాసుకున్నారు డైరీలో

ఏం పాపం చేశానని నాకింత శిక్ష విధించారు? మీరు ఇంకా రాని రాత్రి సమయాల్లో మీ డైరీలు మీ ఉత్తరాలు చదువుతుంటే నా మనసు వెక్కెక్కి ఏడ్చేది

మీ మనసులో అలాంటి స్థానాన్ని పోగొట్టుకున్న ఈ జీవితం ఇంకెందు కనిపించేది — ఆవేశం వరద కన్నీళ్ళుగా ఆవిరైపోయాక మనసు స్థిమితపరచుకుని — సాధనతో స్థితప్రజ్ఞత సాధించాను

ఏ కారణం వల్లనైతేనేమి ఒకటిగా పెనవేసుకుపోగవలసిన మన మనసులు సమాంతర రేఖలుగా మారిపోయాయి

ఎంత దూరం ప్రయాణించినా మధ్య దూరం ఒకటేగదా !

అందుకే మీకు ఏ రకంగా ఇబ్బంది కలగకుండా నా లోకం నేను ఏర్పరచుకొన్నాను

తప్పంటారా ?

ఈ దూరం ఎలా తగ్గించాలో మీరే ఆలోచించండి ఎందుకంటే ఈ దూరం మీరే ఏర్పరచారు కాబట్టి

ఇంకో సంగతి చెప్పనా ?

మనిద్దరం ఇరవై రెండేళ్ళుగా ఒకరి కొకరం తెలుసు

ఇరవై రెండేళ్ళ క్రిందట—అప్పటి మీ పట్ల నా మనసు ఎలాగుందో — ఇప్పుడూ — జుట్టు నెరిసినా సహజంగా, భౌతికంగా మారినా — నా మనసు మాత్రం అలాగే వుంది — ఇప్పటి రాజారావు పట్లగాదు — నా రౌడీ రాజారావ్ పట్ల అందుకే పరిష్కారాన్ని మీకే వదిలేస్తున్నాను

మీ

డివిత్ 'ఇ'

పి ఎస్ — ('ఇ' అంటే గుర్తుందా — మన కోడ్ వర్డ్ — ఎలిక్జర్ — అంటే అధరామృతం)



# చెట్టుకి ప్రాణం పోస్తున్న సుందర్‌లాల్ బహుగుణ



ఆది 1973వ సంవత్సరం మార్చి 27 నాడు ఉత్తరప్రదేశ్‌లోని ఒక గ్రామంలో మహిళలు తమ నిత్య జీవితంలో ఒక ముఖ్యాంశమయిన అడవులను కాపాడుకోవటానికి మొదలుపెట్టిన ఉద్యమం ప్రపంచ దృష్టిని ఆకర్షిస్తుందని ఎవ్వరూ అనుకోలేదేమో ! అలహాబాద్‌నుండి ఆటవస్తువులు తయారుచేసే కంపెని ఒకటి చెట్లను నరకడానికి వచ్చినపుడు 'మండల్' గ్రామంలోని స్త్రీలు చెట్లను వాటేసుకొని నరకకుండా కాపాడుకున్నారు ఈ సంఘటనే "చిప్కో ఉద్యమం"గా చరిత్రలోకి ఎక్కింది హిందీలో 'చిప్కో' అంటే అతుక్కోవడం, వాటేసుకోవడం ఈ విధంగా నాంది పలికిన ఉద్యమం పదేళ్ళలో దేశంలోని పలుచోట్లకు, విదేశాలకు ప్రాకిపోయి ప్రశంసలను పొందింది అసలు నిజానికి చిప్కో ఉద్యమం 1730వ సంవత్సరంలో జోధ్‌పూర్ (రాజస్థాన్)లో మొదలయినట్లు సుందర్‌లాల్ బహుగుణగారు విషాద చరిత్రాత్మక సంఘటనను పేర్కొంటారు

జోధ్‌పూర్ మహారాజు భవన నిర్మాణానికి కర్ర తేవడానికి మనుషులను "ఖేజార్లి" అనే గ్రామానికి పంపుతాడు రాజు మనుషులు చెట్లు నరకడానికి వచ్చారని తెలిసి అక్కడి మహిళలు చెట్లను కాపాడుకోడానికి ఒక్కొక్కరు ఒక్కొక్క చెట్టు వద్దకు చేరుకుంటారు చాలాసేపు వీరికి రాజు మనుషులకు వాదనలు జరుగుతాయి చివరకు అమృతాదేవి అను మహిళ 'ప్రాణాల నిచ్చయినా చెట్లను రక్షించుకుంటాం' అన్న తమ దృఢ నిర్ణయాన్ని తెలుపుతుంది రాజు మనుషులు ఇవేమి పట్టించుకోక చెట్లను నరకడానికి ముందుకువెళ్ళి ఆడవారిని తొలగించే ప్రయత్నంలో అమృతాదేవి నేలపై పడిపోతుంది వెంటనే ఆమె లేచ పరిగెత్తి చెట్టును వాటేసుకుంటుంది కాని రాజు మనుషులు ఆమెను చంపి చెట్లను నరకుతారు అమృతాదేవి మాదిరిగానే ఆమె ముగ్గురు కూతుళ్ళకు కూడ ఇదే గతి పడుతుంది వీరితోపాటు తోటివారు కూడ చెట్లను వాటేసుకోవడం—రాజు మనుషులు వారిని చంపడం జరుగుతుంది ఈ విధంగా చెట్లను కాపాడుకోవడంలో ఆరోజు 363మంది ప్రాణాల్ని కోల్పోతారు

బహుగుణను అన్నిచోట్ల చిప్కో ఉద్యమానికి నాయకునిగా పేర్కొంటారు కాని "నిజానికి ఈ ఉద్యమానికి నాయకత్వం వహించింది స్త్రీలు వారిదే ఈ గొప్పతనం వారికే ఈ పేరు, ప్రశంసలు రావాలి నాకు కాదు" అంటారు ఆయన

గ్రామీణ జీవితంలో అడవులు ప్రముఖ పాత్ర వహిస్తాయి అడవుల నుండి వంటచెరకు, వ్యవసాయ పనిముట్లు, కర్ర, పశువులకు మేత, ఔషధాలు, నార(పీచు), పండ్లు కాయలు మొదలగునవి ప్రత్యక్షంగా గ్రామీణులకు లభిస్తాయి ఇవేగాక అడవులు ఆవరణ వ్యవస్థలో ఒక ముఖ్యాంశంగా — శుభ్రమైన గాలిని ఇవ్వడంలో—నీటిని నిలవ ఉంచడంలో— సారవంతమైన మట్టిని బంధించి ఉంచడంలో — వన్య మృగాలకు,పక్షుల నివాసయోగ్యాన్ని కలిగించడంలో కీలకమైన పాత్ర వహిస్తాయి ఈ వాస్తవాలను గ్రామీణ ప్రజలకు సందేశరూపంలో ఇవ్వడానికి గాను బహుగుణ ఒక బృహత్కార్యక్రమాన్ని "పాదయాత్ర" రూపంలో ఆరంభించాడు — పాదయాత్రను 1981 వ సంవత్సరంలో మే—30 నాడు శ్రీనగర్ (కాశ్మీర్) లో మొదలు పెట్టి హిమాచల్‌ప్రదేశ్, ఉత్తరప్రదేశ్, నేపాల్, పశ్చిమబెంగాల్, సిక్కిం, భూటాన్, అరుణాచల ప్రదేశ్, అస్సాం ద్వారా మొత్తానికి 4870 కిలోమీటర్ల దూరం ప్రయాణించి చివరకు కొహిమా (నాగాలాండ్) కు 1983 వ సంవత్సరంలో ఫిబ్రవరి 2 నాడు చేరుకున్నాడు "చెట్లను రక్షించి మానవాళిని కాపాడాలి" అన్న సందేశాన్ని వ్యాప్తిచేసారు ప్రతిచోట గ్రామ ప్రజలు, విద్యార్థులు ఈయనకు సుస్వాగతం పలికారు

సుందర్‌లాల్ బహుగుణగారు ఒకేరకమైన చెట్లను నాటడాన్ని (మోనోకల్చర్) వ్యతిరేకిస్తారు ఇది గ్రామప్రజల అవసరాలను తీర్చవు మనదేశంలో అటవీవర్ధకం చేయడానికి ఎక్కువగా ఉపయోగించేది యూకలిప్టస్ ఇది కర్రను మాత్రమే ఇస్తుంది పశువులకు మేతనివ్వదు విస్తృతమైన శాఖలను చూపదు పక్షులు గూళ్ళు కట్టుకోలేవు తినడానికి పండ్లను ఇవ్వదు "కావున గ్రామ ప్రజల అవసరాలను తీర్చాలనుకుంటె మనకు మిశ్రమ అడవులు కావాలి" అని నొక్కి చెప్తారు దీన్నె ముచ్చటగా బహుగుణ ఆంగ్లంలో "ఫైవ్ యఫ్స్" — ఫూయల్ (ఇంధనం) ఫుడ్ (ఫలాలు) ఫాడర్ (పశువుల మేత) ఫైబర్ (నార, పీచు) ఫర్టిలైజర్ (ఎరువు) అని అంటాడు ఇవే గ్రామీణ మహిళల కష్టాల్ని తగ్గించగలుగుతాయి

హిమాలయాలలో ఉన్న అడవులను రక్షించడానికి బహుగుణ 9జనవరి,1979నాడు ఉపవాస దీక్ష మొదలుపెట్టాడు, 13వ రోజున ఈయన్ను అరెస్టు చేసారు జైల్లోకూడ దీన్ని కొనసాగించాడు చెట్ల నిర్మూలన ఆపివేయడానికి "స్టే" ఆర్డర్ రావడంతో ఫిబ్రవరి ఒకటినాడు ఉపవాస దీక్షను విరమించాడు

— టి. సంపత్‌కుమార్ ★

### తేడా....

ఆమె
చెట్టును వాటేసుకుంది
అది చిప్కో ఉద్యమం
ప్రశంసలు
అదే చెట్టును
నేను చుట్టుకుంటె
జైలు సన్మానం

# సీరియల్: గోరంత దీపం
## — వింధ్యవాసిని

(గత సంచిక తరువాయి)

16

తన పుస్తకం పబ్లిసిటీకి హరిప్రసాద్ ఇచ్చిన సలహాలని ఆమోదించాడు పరశురాం ఇంక చేసిచూపటం అతని వంతు

హైదరాబాద్‌లో ఒక అడ్వర్టయిజ్‌మెంట్ కంపెనీలో హరి స్నేహితుడు, కె హెచ్ వి రావు అనే అతను పనిచేస్తున్నాడు అతనితో కొన్ని విషయాలు సంప్రదించేందుకు హైదరాబాద్ బయలుదేరాడు హరి రేపే ప్రయాణం విషయం కరుణకి చెప్పిపోవాలని పరశురాం ఇంటికి వచ్చాడు

ప్రస్తుతం అతని హోదాలో వచ్చిన మార్పు వల్ల, ప్రయివేటు మాస్టారిగాకాక, ఆ ఇంటి కొచ్చే కొందరు కుటుంబ స్నేహితులకి లభించే గౌరవమే దొరుకుతోంది హరిప్రసాద్‌కి అతన్నే ఇంటల్లుడుగా చేసుకోవాలనే సంకల్పం యజమాని మనసులో ఉన్నట్లు తెలిస్తే మర్యాదలు మరింత అధికంగా జరిగేవేమో!

హరి 'గోరింతదీపం' ఆఫీసులోచేరి రెండేళ్ళు దాటుతోంది అతి త్వరలో అతడి సేలరీ రెండింతలు చేయబడింది ఆ విధంగా అతన్ని పక్షపాత దృష్టితో చూస్తున్నారని పత్రికలో పనిచేసేవారెవరూ అనుకునే ఆస్కారంలేదు ఎందుకంటే అతను పొందిన మెప్పుకి వెనకాల ఎంతటి కార్యదీక్ష, కాల పరిమితులు లేకుండా, ఒళ్ళు తెలియకుండా పనిచేసే తత్వమూ, సమయస్ఫూర్తి ఉన్నయో అందరికీ తెలుసు

ఈ మధ్యనే బ్యాంకులో లోన్ తీసుకుని స్కూటరొకటి కొన్నాడు దాని సహాయంతో ఊళ్ళో తిరగటం సులభంగా ఉంది అతనికి

హరి స్కూటర్ పరశురాం గారింటి ముందొచ్చి ఆగగానే గేటులోపల పూల మొక్కలకి నీళ్ళు పోస్తున్న మాలి గబగబా వచ్చి గేటు తెరచి, "నమస్కారం బాబూ!" అన్నాడు అతను చిరునవ్వుతోనే సమాధానం చెప్పేసి, "చిన్నమ్మాయిగారున్నారా కన్నయ్యా ?" అనడిగాడు

కరుణ స్కూలు ఫైనలు పాసయి ఇంటర్మీడియెట్ చేరింది అతనిప్పుడు తనకి ప్రయివేటు చెప్పటంలేదు ఇంకెవరూ సరి అయిన మాస్టారు దొరకనందువల్ల తనే చదువు కుంటోంది పైగా ఇటర్మీడియెట్ తనకిష్ట మయిన ఆర్ట్స్ సబ్జక్ట్స్ తీసుకోవటం వల్ల చదవటం సులువుగా ఉంది అప్పుడప్పుడు హరివచ్చి పరామర్శించి, ఏమయినా తెలీనివి వుంటే చెప్పి వెళుతూ ఉంటాడు

"ఉన్నారు వెళ్ళండి బాబూ!" అనేసి కన్నయ్య తన పనిలో పడిపోయాడు

తలుపులు మూసి ఉన్నాయి కాలింగ్ బెల్ నొక్కాడు కొన్నిక్షణాల్లో తలుపు తెరుచుకుంది ఎదురుగా కరుణ నేవీబ్లూమీద చిన్న తెలుపు పువ్వులున్న పంజాబీ డ్రస్‌లో బొమ్మలా ఉంది హరిని చూడగానే ఆ అమ్మాయి ముఖం విప్పారింది

"అబ్బ! ఎన్నాళ్ళయిందో మీరొచ్చి రెండు రోజులయి రాజా ఆఫీసుకి ఫోన్ చేస్తున్నా మీ కోసం ఎప్పుడడిగినా బయటికి వెళ్ళారనే చెబుతున్నారు"

"ఏం ? ఏవయినా సందేహాలున్నాయా ? కమాన్ ఇప్పుడు చెబుతాను కూర్చో" అంటూ కరుణ వెనకాలే లోపలికి దారితీసాడు హరి

"ఉండండి ముందు కాఫీ తెస్తాను" అనేసి లోపలికి వెళ్ళిపోయింది హరికి "వాకింగ్ ఎన్‌సైక్లోపీడియా" అని నిక్‌నేమ్ పెట్టుకుంది కరుణ పుస్తకంలో పాఠాలు చెప్పటం సరేసరి ఒక్కసారి వివరిస్తే, మనసులో అచ్చుగుద్దినట్లువుతుంది మామూలు సంభాషణలోనే, తనకి తెలీనివి ఎన్నో విషయాలు తెలుస్తాయి, మాస్టారితో మాట్లాడుతోంటే తనిప్పుడు కాలేజీ పాఠాలు అన్నీ చాల మట్టుకు స్వంతంగా అర్థం చేసుకుని చదువుకోగలదు కానీ అతన్ని అప్పుడప్పుడూ రప్పించేందుకు ఏవో సందేహాలు సృష్టించుకుంటుంది మాస్టారితో కబుర్లు చెబుతూ వుంటే టయిమే తెలీదు — అనుకుంటుంది అతనొస్తాడన్నరోజు ఉత్సాహంగా ఎదురుచూస్తుంది శ్రద్ధగా ముస్తాబు అవుతుంది ఏదయినా కొత్త డ్రస్ వేసుకున్న రోజు, అతను తన స్నేహితుడయినట్లు, మొగమాటం లేకుండా అడిగేస్తుంది, ఎలావుందో చెప్పమని

కరుణ కోసం చూస్తూ డ్రాయింగ్ రూమ్‌లో సోఫా మీద కూర్చున్నాడు హరిప్రసాద్ కాళ్లకున్న షూ, మెడలో టై అతన్ని చికాకు పరుస్తున్నయి ఎప్పుడెప్పుడు గది చేరి ఈ అవతారం మార్చి విశ్రాంతి తీసుకుంటానా అని చూస్తున్నాడు కానీ తను వూరి నుంచి ఎన్నాళ్లకి తిరిగి రాగలుగుతాడో తెలీదు అందుకని ఇవాళ ఎంతసేపయినా కరుణ సందేహాలన్నీ తీర్చి మరీ వెళ్లాలనీ వుంది

ఇంత లోపలే, చేతిలో హేండ్ బాగ్‌తో, హైహీల్స్ టక టక మనిపిస్తూ అటు వచ్చింది అరుణ అతని రాకని ఊహించలేదేమో, హఠాత్తుగా అతను కనిపించగానే ఉలికి పడింది

"హలో మీరా ? "

"ఎక్కడికో బయల్దేరి నట్లున్నారు ?"

"మా ఫ్రెండ్ ఇంట్లో బర్త్‌డే పార్టీకి వెళుతున్నాను" అన్న తర్వాత, ఎందుకు చెప్పానా అనిపించింది అరుణకి ఎందుకంటే ఎన్నాళ్లకో ఇంటి కొచ్చిన హరితో కాస్సేపయినా మాట్లాడా లనిపిస్తోంది కానీ ఇంతగా తయారయి, వెళ్లబోతూ ఆఖరి నిముషంలో ఆగిపోవటం ఏంబావుంటుంది ? అతనేమనుకుంటాడు ? తనంతట తానుగా అతని స్నేహాన్ని కోరుతున్నట్లు కనిపించటం అరుణ కిష్టంలేదు ఎందుకంటే ఎప్పుడూ నవ్వుతు మాట్లాడినట్లే వున్నా, అతని మనసులో ఏమున్నదీ తన కింతదాకా అర్థం కావటంలేదు ఎప్పుడూ గిరిగీసినట్లుగా ప్రవర్తించే అతని తీరు విసుగ్గా కూడా వుంది

**జరిగినకథ — 5:** 'గోరంత దీపం' రాయలసీమ వార్తా వారపత్రిక ఎడిటర్ విశ్వమూర్తి, ఎం డి పరశురామ్ ప్రాణస్నేహితులు విశ్వమూర్తి కూతురు రమణ అదే ఆఫీసులో పనిచేస్తోంది పరశురామ్ కూతురు కరుణకు ట్యూషన్ చెబుతున్న హరిప్రసాద్ కరుణ సహాయంతో ఆ ప్రెస్‌లోనే ఉద్యోగం సంపాయిస్తాడు మంచి తెలివితేటలు, చొరవ గల హరిప్రసాద్‌కు తన పెద్దకూతురు అరుణను ఇచ్చి పెళ్లి చేయాలని నిశ్చయించుకొంటాడు పరశురామ్ గతంలో — గుండూరావ్ ప్రెస్‌లో పని చేస్తుంటాడు విశ్వం ఇంట్లో వాళ్లకు తెలియకుండా తమ కులం కాని మీనాక్షిని చేసుకొని ఆ వూర్లో కాపురం పెడతాడు తన స్నేహితుడు పరశురామ్‌ని కూడా తీసుకొచ్చి ఆ ప్రెస్‌లోనే చేర్పించి, తన ఇంట్లోనే ఉంచుకొంటాడు పరశురామ్‌కి చదువు లేకపోయినా వ్యాపారంపై ఆశక్తి ఎక్కువ అందువల్లే క్షణం తీరికలేకుండా ఏవో చిన్న చిన్న వ్యాపారాలు చేస్తుంటాడు గుండూరావ్ కూతురు కామేశ్వరిని పెళ్లి చేసుకొంటాడు పరుశురామ్ తన భార్య మీనాక్షి కాన్పు కష్టం అయి చనిపోగా విశ్వం బెంగుళూరులో వున్న ఒక ఆంగ్ల పత్రికలో రిపోర్టర్‌గా చేరతాడు 'గోరంత దీపం' అనే వారపత్రికను పరశురామ్, విశ్వం కలిసి నెలకొల్పుతారు

"కరుణ రావటంలేదూ ?"

"ఉహూ దానికిలాంటి పార్టీలు, సందడీ నచ్చవు నలుగుర్లో కలవటం అన్నా పడదు "

"అలాగా" అన్నాడు, "మరయితే వెళ్ళండి పాపం" అన్న ధోరణిలో

ఉసూరుమంటూ బయలుదేరింది అరుణ గంట సేపట్నించీ చేసుకున్న మేకప్ అంతా ఒక్క క్షణంలో ఏర్పడిన నిరుత్సాహంతో తుడిచి పెట్టుకు పోయినట్లయింది ఆమె ముఖంలో

కాఫీ తెచ్చింది కరుణ ఎదురుగా కూచుని, అతనో రెండు గుక్కలు తాగగానే "కాఫీ ఎలా ఉంది మాస్టారూ ?" అనడిగింది

"ఏమిటబ్బా ప్రత్యేకంగా ఎలా వుందీ అని అడుగుతున్నావే" హరి ఆశ్చర్యం

"నేనే చేశాను "

"నిజంగా అందుకేనేమో ఇంత బాగుంది" సరదాగా అన్నాడు నెల రోజుల క్రిందట వచ్చినప్పుడు, కరుణతో తను "వచ్చినప్పుడలా వూరికే కాఫీ కప్పు అందివ్వటం కాదు, నువే చేసుకుని తీసుకురావాలి" అన్నాడు ఆ అమ్మాయి గుర్తుంచుకుని ఇవాళ స్వయంగా తనే తయారు చేసిందన్నమాట— అనుకున్నాడు

"రేపు హైదరాబాదు వెడుతున్నా కరుణా నీకేం కావాలో చెప్పు తీసుకొస్తాను "

"అవును మాస్టారూ! ఏం చెప్పేదబ్బా " అని రెండు బుగ్గలకీ చేతులు చేర్చి ఆలోచనలో పడిపోయింది కరుణ మనిషయితే నాలుగున్నర అడుగులకి పయినే పెరిగింది కానీ, ముఖంలో, మాటల్లో ఇంకా పసితనమే కనిపిస్తుంది హరికి

"మీరేది కోరినా, ఏ వూరునుండీ అయినా మీ డాడీ మీకు తెచ్చిపెడతారని తెలుసు అయినా ఏదో నా సంతృప్తికోసం చెప్పు "

కొన్ని క్షణాల తర్వాత చెప్పింది కరుణ "ఈ ఏడాది దసరాకి బొమ్మలకొలువు పెడదామనుకున్నాను అందుకు పనికొచ్చే బొమ్మలేవయినా తెచ్చిపెట్టండి" అని

ఆమె కోరికకి నవ్వుకుంటూనే పారం మొదలు పెట్టాడు

## 17

మరుసటి రోజంతా తీరిక లేనిపని హరి ప్రసాద్‌కి లంచ్ టయింలో నయినా రమణని కలుసుకుని, వూరు వెళుతున్నానని చెబుదామంటే వీలుపడలేదు రాత్రి బయలుదేరే ముందు కాస్త ముందుగా తయారయి వెళితే సరి అనుకున్నాడు

ఈ మధ్య కొన్ని రోజులుగా రమణకీ, హరికీ మధ్య స్నేహం బాగా అభివృద్ధి అయింది ఇద్దరూ ముక్తసరిగా మాట్లాడేవారు కావటం వల్లనేమో బహువచనాన్ని దాటి మాత్రం వెళ్ళలేదు అయితే తనకి తెలీకుండానే ఆమెకి తను దగ్గరవుతున్నానా అనిపిస్తుంది హరికి ఆమె మనసులో తన మీద ఎటువంటి అభిప్రాయం ఉన్నదీ తెలుసుకోగల అవకాశం మాత్రం ఇంత వరకూ రాలేదు హరికిది బాధగా ఉంది లోలోపల ఎంత ఆరటంగా ఉన్నా, ఆమె ఏమనుకుంటుందో అని చొరవ చూపలేకుండా ఉన్నాడు

మొదటిరోజు రమణని టైపిస్ట్ చోటులో చూచినప్పుడే, ఆమె రూపం మనసులో ముద్రించుకున్నాడు హరి ఏ అలంకారాలు లేని ఆమె అందం, సింప్లిసిటీ అతన్ని ఆకట్టుకున్నాయి వెంటనే తనని ఆమెతో పోల్చి చూసుకున్నాడు తనకీ సింపుల్‌గా వుండటమే ఇష్టం అందం ఫరవాలేదు, ముక్కూ ముఖమూ సరిగ్గానే ఉన్నాయి కాకపోతే ఆమెకు జతగా సరిపోయేంత ఎత్తులేదు తను అదొక్కటే సమస్య!

న్యూస్‌పేపర్ ఆఫీసులో చేరిన తర్వాత ఎన్నోసార్లు ఆమెతో కలవటం, ఆఫీసు విషయాలు మాట్లాడటం, అవసరం అయినప్పుడు ఇద్దరూ కలిసి పనిచెయ్యటం జరుగుతూనే వున్నాయి హరి చూపులని, వాటిలో భావాలని చదవలేనంత తెలివితక్కువది కాదు రమణ కానీ తను తొందరపాటు మనిషి కాదు అతని మనస్సులో ఏమయినా ఉండనీ తన మనసు పారేసుకునే ముందు, అతని మనస్తత్వం ఏమిటి, తన మీద అతడి కెంత ఇష్టం ఉన్నదీ, అతని అలవాట్లు, నడవడిక అన్నీ వివరంగా తెలుసుకుంటూ వుంది అతడికి తల్లిదండ్రులు లేరని తెలిసింది వెంటనే అతడి మీద జాలిగా అనిపించింది తల్లి లేకపోవటం అంటేనే ఎంత బాధగా ఉంటుందో తనికి తెలుసు, అలాంటిది ఏ దిక్కూ లేకపోతే ఇంకెంత కష్టమో ! అబ్బా అనుకుంది ఇలాంటి వాళ్ళు



పెళ్ళి అవుతే భార్యలని అతిగా ప్రేమిస్తారని ఎక్కడోవిన్నది తను

రోజు రోజుకీ తండ్రికి కుడిభుజంగా మారి పోతున్న హరిని అభిమానించకుండా ఉండలేక పోతూంది రమణ అతను ఎక్కువగా పనిమీద బయట తిరుగుతూ వుంటాడు ఏ రోజయినా లంచవర్లో ఆఫీస్‌లోవుంటే ఏదో ఒక పని కల్పించుకుని రమణ దగ్గరికి వెళతాడు అప్పటి కామె ఇంకా ఇంటినుంచీ తెచ్చిన బాక్స్ విప్ప కుండా అలాగేవుంటే అతనిక్కొంచం భాగం ఇస్తుంది అది తినేసాక కాఫీకోసం ఇద్దరూ కాంటీనుకి వెళతారు

''అబ్బ! ఇంత ఘోరంగా ఉన్న కాఫీ రోజుకి అన్నిసార్లెలా తాగుతారు మీరు ?'' అంటుంది

''మీకేమండీ హాయిగా ఇంట్లో చక్కగా స్వయంగా కలుపుకుని తా గు తా రు మాకు హోటల్‌తప్ప మరో దారి లేదు'' అని అతని సమాధానం

సాయంత్రాలు కొంచం ఆలస్యం అయిన రోజుల్లో కొన్నిసార్లు స్కూటర్లో లిఫ్ట్ ఇస్తుం టాడు హరి ఆమెకి వాళ్ళింటిదగ్గర ఆమె తనని లోపలికి రమ్మంటే బాగుండునను కుంటాడు అతను తనవెంట బాల్కనీవరకయినా వస్తాడేమో, మంచినీళ్ళయినా అడుగుతాడేమో అని ఆమె చూస్తుంటుంది ఏమీ జరగవు ఆమె పైకివెళ్ళి ఒక్కక్షణం నిలబడి, స్కూటర్ మీదినుంచి పైకిచూస్తున్న అతని వయిపు చూస్తుంది అతను 'వెళ్తాను' అన్నట్లు తల వూపేసి, స్కూటర్ స్టార్ట్ చేస్తాడు

ఆ వేళ మధ్యాహ్నం అతను రాత్రి ఇంటి కొస్తానని ఫోన్‌చేసి చెప్పగానే సంతోషం వేసింది అతను ఊరు వెళుతున్నాడని తెలుసు అతన్ని కలుసుకుని మాట్లాడికూడా ఎన్నో రోజులయింది అతనికి తమ ఇంట్లో భోజనం పెట్టాలని అనుకుంది సాయంత్రం కాస్త త్వరగా ఇల్లు చేరుకుంది పాయసం, వడలు, సాంబారు, వంకాయ వేపుడు కూరచేసి రసం పెట్టింది అన్నం వేడిగా కుక్కర్‌లోనే ఉంచేసింది స్నానం చేసి, ఎరుపురంగు జరీఅంచున్న తెల్లని గద్వాల చీర కట్టుకుని తలదువ్వి, వదులుగా జడవేసు కుంది

హరిప్రసాద్ సరిగ్గా ఎనిమిది గంటలకి విశ్వమూర్తిగారిల్లు చేరాడు అప్పటికి నాలుగు సార్లు రమణ కిటికీ దగ్గరికొచ్చి చూసింది అత నొస్తున్నాడేమోనని అయిదోసారి చూసేసరికి హరిప్రసాద్ ఒక ఎయిర్‌బాగ్, మరొక చిన్న బ్రీఫ్‌కేస్‌తో ఆటో దిగటం కన్పించింది తెల్లని పైజమా, లాల్చీ వేసుకున్నాడు, ప్రయాణంలో తేలికగా ఉంటాయని

అతను మెట్లెక్కి పైకి వచ్చి తలుపు తట్టబోయేంతలో తనే తెరిచి ఎదురుగా నిలుచుంది రమణ ఒక్కక్షణం రెప్పవేయకుండా



# గోరంత దీపం

ఆమెనే చూస్తూవుండిపోయాడు ఆమె 'రండి' అనేదాకా తేరుకుని లోపలికి అడుగు వేయలేదు కాళ్ళకున్న ఆకు చెప్పులు అక్కడే విడిచి ఆమె వెంట నడిచాడు ఆలోచిస్తూ తనామెని ఇంతకు ముందెన్నిసార్లో చూశాడు కానీ ఇవాళేమిటో కొత్తగా, వేరుగా కన్పిస్తోంది ఎక్కడున్నది తేడా అని చూస్తున్నాడు కళ్ళజోడు లేకపోవటం వల్లనేమో కాస్త చిన్నపిల్లలా కనిపిస్తోంది అంతేకాదు ముఖంలోకూడా తను అంతకు ముందెప్పుడూ చూడని భావాలేవో కన్పిస్తు న్నాయి అసలు విశ్వమూర్తిగారు లేనప్పుడు తనిలా వస్తే ఆమె ఎలా రియాక్ట్ అవుతుందో అని భయపడ్డాడు హరి హయినా ఏమయినా సరే, ఆమెతో ఇవాళ మనసు విప్పి మాట్లాడాలని నిర్ణయించుకునే బాగా టయిం ఉంచుకుని వచ్చాడు

బాగ్, బ్రీఫ్‌కేస్ టిపాయ్ మీదుంచి సోఫాలో కూచున్నాడు ఆమె సాన్నిధ్యంలో మంత్రం వేసినట్టుగా వుంది ''హైదరాబాద్ వెళుతున్నా ఈ రోజు, మీకు తెలిసేవుంటుందనుకుంటాను ''

''ఊ, నాన్నగారు చెప్పారు మీ పుస్తకం పబ్లిసిటీ వర్క్‌మీద వెళుతున్నారు కదూ ?''

రమణ జవాబుకోసం చూడకుండా లోపలికి

ఇటీవల చిత్తూరులోని బాలానంద సంఘం వారు నిర్వహించిన రాష్ట్రస్థాయి సబ్ జూనియర్ల భరతనాట్య పోటీలలో ద్వితీయ బహుమతి పొందిన చిరంజీవి ఎం డి శ్రీమాల మూడేళ్ల వయసుగల ఈ పాప శ్రీ సూరిబాబు శిష్యురాలు తల్లిదండ్రులు శ్రీమతి కళానాయిడు, శ్రీ ఎం డి నాయుడు ఇద్దరూ ఉపాధ్యాయులే



వెళ్ళి ఓ గాజుగ్లాసునిండా ఆరంజి జ్యూస్ తెచ్చి అతని కందించింది

''నాకేనా ? మరి మీకో ?''

''ఫరవాలేదు మీరు కానివ్వండి '

''అలాకాదు గ్లాసొకటి తెండి చెరిసగం తీసుకుందాం'' మళ్ళీ లోపలికి వెళ్ళింది

ఆమె తెచ్చుకున్న గ్లాసులో సగం జ్యూస్ పోసి ఇచ్చాడు ఎదురుగా మరో సోఫాలో కూచుంది రమణ

ఫ్యానుగాలికి ఎగురుతున్న ఆమె ముంగురుల్నీ, చీరకుచ్చిళ్ళనీ గమనిస్తూ జ్యూస్ తాగుతున్నాడు హరి నిదానంగా ఏ అలంకారాలూ చేసుకోని ఈమెలో ఎక్కడుంది ఆకర్షణ ? అని ఆలో చిస్తున్నాడు అతను నిజానికది ఆకర్షణ కాదనీ, ఆమెమీద తన మనసులో ఏర్పడిన ఇష్టమే ఆమెలో అందాలని చూడగలిగేలా చేస్తోందనీ అతనికి తెలీదు

''ఏమిటాలోచనలో పడిపోయారు''అడిగింది రమణ

''మనిద్దరి గురించే ఆలోచిస్తున్నాను'' అనాలోచితంగా అనేసి, నాలిక్కర్చుకుని ఆమె ముఖంలో భావాలకోసం వెతుక్కోసాగాడు హరి

''రాత్రి ప్రయాణంలో చేసేందుకు పని ఏమీ ఉండదుగా ? అప్పుడు తీరిగ్గా ఆలోచనలు చేద్దురుగాని, భోజనానికి లేవండి'' అన్నది తేలిగ్గా నవ్వేస్తూ

నవ్వితే ముత్యాలు తీర్చినట్లున్న ఆమె పలు వరసనే చూస్తున్న హరికి, ఆమె ఏం అంటున్నదీ అర్థం అయేసరికి, కొన్ని క్షణాలు పట్టింది అర్థం అవగానే, ''అబ్బే భోజనమా నేనూ''

''భోజనం చేసి వచ్చాను అని అబద్ధం చెప్పేందుకు ఎందుకు అవస్థ పడతారు గానీ పదండి చేతులు కడుక్కుందురు ''

ఇంక తప్పలేదు హరికి ఆమె అంత ఆపేక్షతో అధికారం చూపిఁచేస్తూంటే ఏమన గలడు ? అయినా ఈ ఇంట్లో ఇలా వచ్చి ఒంటరిగా రమణని కలుసుకోవటం మొదటిసారి కావటం వల్లనేమో మొహమాటంగా వుంది అతనికి

రమణ టవల్ అందించి, బాత్‌రూం చూపించింది కాళ్ళు చేతులు కడుక్కునివచ్చాడు డైనింగ్ టేబుల్ ముందొక కుర్చీ లాక్కుని కూచున్నాడు

ప్లేట్లో పొగలు కక్కుతున్న అన్నం పైన అప్పుడే వేసిన నెయ్యి మెల్లగా కరుగుతోంది పక్కనే చిన్ని గిన్నెలో పా యి స ం ఉంది పాయసంతో ప్రారంభించాడు భోజనం

సాంబారు గిన్నె పట్టుకొచ్చింది రమణ, రెండు గరిటెలు వేయగానే, చాలుచాలు అని చెయి అడ్డంగా ఉంచాడు హరి మూడో గరిట సగందాకా హరి చేతిమీద ప డి పో యి ం ది మ్మ్రరుమన్నదేమో, 'అబ్బా' అని చేయి పక్కకి లాక్కున్నాడు వెంటనే

# గోరంత దీపం

"అయ్యో! సారీ" అంటూ ఛేర్‌మీదే వున్న నాప్‌కిన్‌తో, గబుక్కున అతని చేయి అందుకుని తుడిచింది "బాగా నేడిగాతగిలిందా?" అన్నది నొచ్చుంటూ, అతని చేయింకా అలాగే పట్టుకుని

"పోనీ, తుడిచేరుగా చల్లగా హాయిగా వుంది" అతను తన్మయంగా అంటోంటే, గబుక్కున అతని చేయి విడిచెయ్యబోయింది చిన్నగా నొక్కి వదిలేసాడు హరి అన్నం కలుపుకుని, మధ్య మధ్యలో వడలు, వేపుడుకూరతో భోజనం చేసాడు

అతని కెదురుగా మరో కుర్చీలో కూర్చుంది రమణ ఇద్దరి మధ్యా కొంతసేపు ఆఫీసు విషయాలే దొర్లాయి

"మళ్ళీ మీరీ మధ్య ఏమీ రాస్తున్నట్లు లేదు కదూ?"

"ఎక్కడా ఆఫీస్ పనితోనే టయిం అయిపోతుంది రాత్రి గది చేరటం తరువాయి మొద్దు నిద్ర వచ్చేస్తుంది రాయటానికీ, ఆలోచించేందుకూ టయిమే ఉండటంలేదు అయినా ఆదివారాలు ఏవో రాయాలని ప్రయత్నిస్తూనే వుంటాను ఏం లాభం? ఒక వారం రాసినది మరో వారానికి కంటిన్యుయేషన్ మిస్ అవుతూంటుంది"

"పోనీ మీకేదయినా ఫేర్ చేసే వర్క్ ఉంటే చెప్పండి నేను చేసిపెడతాను ఇంట్లో ఉన్నంతసేపు కాస్త వంట తప్పిస్తే ఫ్రీగానే వుంటాను"

"మీకీ ఊళ్ళో ఫ్రెండ్స్‌కూడా అంతగా ఉన్నట్లు కనిపించదు"

"మీరన్నది నిజమే అరుణ, కరుణ తప్ప వేరే ఫ్రెండ్స్ ఎవరూ లేరు"

అతను అన్నం కలుపుకుని తింటున్న తీరునే గమనిస్తూవుంది చేతో కలపటం ఎక్కువ తినటం తక్కువ అంత పని చేసే మగవాడు ఇంత తక్కువ తింటాడేమిటా అనిపించింది రమణకి

హరి భోజనం అయింది చేయి కడుక్కుంటూ, "మీరింత బ్రహ్మాండంగ వంట చేస్తారని తెలిస్తే, ఇన్నాళ్ళు ఆగేవాణ్ణికాదు ఎప్పుడో ఛాన్స్ చూసుకుని భోజనానికి వచ్చేసేవాణ్ణి" అన్నాడు నవ్వుతూ

"థాంక్స్ పోనీ ఇకముందు అప్పుడప్పుడు ఛాన్స్ తీసుకోండి" అన్నది

హాల్లో వెళ్ళి కూర్చున్న తర్వాత అడిగాడు హరి, "సిగిరెట్ కాల్చుకోవచ్చా?" అని అతను కొంచం ఎక్కువగానే సిగిరెట్లు కాలుస్తాడని తెలుసు

"నో అబ్జక్షన్" అంటూ తనూ వచ్చి కూచుంది వస్తూ వక్కపొడి డబ్బా తెచ్చి అతని ముందుంచింది అలా రావటం, ఆమె అడుగడుగునా ఆపేక్షగా అన్నీ వడ్డిస్తూంటే తను భోంచేయటం, ఎంతో ఆత్మీయుల్లా ఎదురెదురుగా కూచుని మాట్లాడుకోవటం– ఇదంతా ఓ కలలా వుంది అతనికి ఇంకా ఆమెతో ఏదో చెప్పాల్సింది ఉందని పిస్తూంది కానీ, మనసులో భావాలకి భాష అంది రావటంలేదు

ఇంకాస్సేపట్లో అతనికి టయిమవుతుంది ఏమయినా చెబుతాడేమోనని చూస్తూంది ఆమె

"మళ్ళీ ఎప్పుడు తిరిగి రావటం?"

"వారం రోజులు పట్టచ్చు" కావాలనే అవసరానికి మించి చెప్పాడు, ఆమె రియాక్షన్ చూడాలని

"అన్ని రోజులే?" రమణ ఆశ్చర్యం

## ఫోన్‌లో కవితలు!

ప్రజలలో సాహిత్యాభిలాషను పెంపొందించటానికి పశ్చిమ జర్మనీ తంతిశాఖ టెలిఫోన్లలో కవితలను విన్పించే పద్ధతిని ప్రవేశపెట్టింది దీనిని మొదట 1978లో కీల్ నగరంలో ప్రయోగాత్మకంగా ప్రవేశపెట్టారు ఇది ప్రజాదరణ పొంది ప్రస్తుతం పన్నెండు నగరాలలో అమలులో ఉంది సాధారణంగా రచయితే చదివిన కవితలను రికార్డుచేసి ఉంచుతారు దీని సమయం నాలుగు నిమిషాలకు మించదు వర్ధమాన కవులకు ఇది ఒక చక్కని అవకాశం వీరి కవితలు టెలిఫోన్ల ద్వారా ప్రజా బాహుళ్యానికి చేరుతున్నాయి పొద్దస్తమానము తీరికలేకుండా ఉండే వ్యాపారవేత్తలకు మధ్య మధ్య నాలుగు నిమిషాలపాటు చక్కని మార్పు ఇస్తున్నాయి

"త్వరగా వచ్చెయ్యమంటారేమిటి?"

"నేను రమ్మంటే వస్తారా?"

"తప్పకుండా మీరేం చెప్పినా చేస్తాను, ప్రామిస్" సిన్సియర్‌గా అంటున్న హరిని చూస్తే రమణ మనసు వెన్నలా కరిగిపోతూవుంది

"లాభంలేదు ఇతను ఇంతకన్నా ఏమీ చెప్పలేదు" అనుకుని 'ప్రామిస్!' అంటూ చేయి చాచింది

ఆ చేతి నందుకుని, అలాగే ఆమెను దగ్గరకి లాక్కున్నాడు హరి భుజాల చుట్టూ చేతులేసి గట్టిగా హత్తుకున్నాడు "నిజం రమణా, నువేం మంత్రంవేసావో నాకు తెలియదు నా మనసు ఎప్పుడూ నీ చుట్టూనే ప్రదక్షిణం చేస్తూంటుంది అయి లవ్ యు" గుసగుసగా



అంటూ, ఆమె పెదవుల మీద ముద్దు పెట్టుకున్నాడు

కాలం స్తంభించినట్లుగా ఉంది రమణకి అతని ఒడిలో సర్వం మరచి కళ్ళు మూసుకుని ఉండిపోయింది

ఫ్యాను తిరుగుతూనే వున్నా నుదుటి మీద పట్టిన చమటలో అతుక్కుపోయిన ఆమె వెంట్రుకల్ని సవరిస్తూ, "మరి నే వెళ్ళేదా నాకు టయిమవుతోంది" అని అతనంటే, ఉలిక్కిపడి, అతని మెడ చుట్టూ వేసిన చేతులు తీసేసి, లేచి నిలుచుంది రమణ

బ్యాగ్, బ్రీఫ్‌కేస్ అందుకుని చెప్పులేసుకున్నాడు హరి మాటలు రానిదానిలా చూస్తూ వుండిపోయిందామె దగ్గరికి రమ్మని కళ్ళతోనే పిలిచాడు రెండు అంగల్లో వచ్చేసిన ఆమెని ఒక చేత్తో దగ్గరికి తీసుకున్నాడు తలని అతని భుజంమీద ఆన్చేసి నిలుచుంది

సరిగ్గా అప్పుడే అనిపించింది హరికి, 'తనింకో రెండించీలు పొడవుంటే బావుండేది కదా' అని

దిగులుగా చూస్తున్న ఆమె బుగ్గల్ని ఒక్కసారి పెదవులతో తాకి, వదిలేశాడు

"వెళ్ళొస్తా మరి" అంటూ మెట్లకేసి నడిచాడు బాల్కనీలో నిలుచుని చూస్తూ వుండిపోయింది రమణ

* * *

హరిప్రసాద్ ఎక్కిన రైలు కదిలేముందుగా అతను ఊహించని సంఘటన ఒకటి జరిగింది సరిగ్గా రైలు బయల్దేరటానికి అయిదు నిముషాలుందనగా, అంత దూరంలో పట్టుపావడా కొద్దిగా ఎత్తి పట్టుకుని పరిగెత్తి వొస్తున్న కరుణ కన్పించింది

"ఏమిటీ అమ్మాయి పిచ్చి, పరశురాం గారేమనుకుంటారో" అనుకున్నాడు హరి అతనున్న రిజర్వ్‌డ్ కంపార్ట్‌మెంట్ దగ్గరి కొచ్చి ఆగి ఆయాసం తీర్చుకుంది అతను కిందికి దిగివచ్చాడు

"ఇదిగో ఇవి మీ కోసమే కొన్నాను", కొన్ని ఇంగ్లీషు మేగజీన్లు అతని కందించింది

"ఒక్కర్తివీ వచ్చావా ఇంత రాత్రి"

"ఒక్కదాన్నేమిటి మాస్టారూ ? డ్రైవర్ వెంట వున్నాడుగా ఆసలు అక్కయ్య వస్తానన్నది ముందు దానివల్లనే ఇంతాలస్యం అయింది ఆఖర్న తల నొప్పిగా వుంది, రాను పోవే అన్నది అయినా అదేమిటోగానీ, దానికేక్షణం ఏ బుద్ధి పుడుతుందో అర్థమే అవదు నాకు"

"డాడీ వచ్చారా ఇంటికి ?"

"ఊ వచ్చేశారు, ఆయనే వెళ్లమన్నారు"

"ఓహో ఫరవాలేదు" అనుకున్నాడు హరి మళ్ళీ అంతలో 'ఆయన కెందుకింత శ్రద్ధ తన మీద' అని అనుమానం కలిగింది

మూడో గంట కొట్టారు, సిగ్నల్ ఇచ్చారు




"వెళ్ళొస్తా" అని హరి రైలు ఎక్కడం, రైలు కదిలి పోవటం ఒక్కసారే జరిగినాయి కరుణ కర్చీఫ్ ఊపుతూ ఉంది రైలు స్టేషను దాటే వరకూ చూస్తూ ఉండిపోయాడు హరిప్రసాద్

తన బెర్త్ మీద దుప్పటి పరచుకుని పడుకున్నాడు, ఇల్లస్ట్రేటెడ్ వీక్లీలో ఎడిటోరియల్ 'చదువుతూ' అలాగే నిద్ర పట్టేసింది చల్లగాలికి మళ్ళీ అర్ధరాత్రి మెలకువ వచ్చింది చలిగా వుంటే పరుచుకున్న దుప్పటినే లాగి కప్పుకుని ముసుగు తన్నాడు నిద్ర మాత్రం రావటం లేదు రైలు ఏదో స్టేషన్లో ఆగితే కప్పు టీ తాగి సిగరెట్ అంటించుకున్నాడు

తను హైదరాబాద్‌లో కలవబోతున్న స్నేహితుణ్ని తల్చుకుంటే అతనికి చిన్నతనం రోజులన్నీ గుర్తొచ్చినాయి

[ఇంకా వుంది]

# సిని
# విశేషా
–జి



'సితార' భానుప్రియ

## "నాగభైరవ"లో నరసింహం బోధన

పెద్దమనిషిగా చెలామణి అవుతూ, పెడదార్లు తొక్కడంలో ముందు వరుసలో ఉన్న నరసింహం (వంకాయల) ఆ ఊరి సర్పంచ్. ఆయన కుమార రత్నం శేషు (నరసింహరాజు). తండ్రి పాడుపనులు చేసినా – వాటిని కప్పిపుచ్చుకునే సమర్థత గలవాడు. చెడ్డపనులు చేయడంలో తండ్రి పోలికలు వచ్చినా – వాటిని కప్పిపుచ్చుకోగల సామర్థ్యం మాత్రం అబ్బలేదు. ఏనాటికైనా తెలుసుకోకపోతాడా అని చాలాసార్లు అవకాశమిచ్చి చూశాడు తండ్రి. తెలుసుకోకపోగా అందరిచేత తిట్లు, తన్నులు తినే స్థితికి వచ్చే సరికి ఒళ్ళు మండిపోయింది తండ్రికి. కొడుకు మీద చెయ్యిచేసుకుని, "ఏం చేసినా గుట్టుండాలి. కాని, చేసింది ఎవరికీ తెలియకూడదు. నువ్వు చెయ్యాలనుకున్నవన్నీ చేసేయ్. ఎవరూ నోరెత్తకుండా చెయ్. అందుకు అవసరమైన ఏర్పాట్లన్నీ చెయ్. అదేరా పరువు ప్రతిష్ఠలను నిలుపుకునే కిటుకు. మనబోటి పెద్దవాళ్ళ బతుకు," అంటూ జీవిత సూత్రాలను గురించి బోధించాడు. దాంతో అసలే పొగరెక్కిన ఆంబోతులా ఊరిమీద పడే శేషుకి కొండంత బలం వచ్చింది.

ఈ తండ్రీ కొడుకులు కలిసి ఆ ఊళ్ళో చేసిన ఘనకార్యాలకు జరిగిన ఘన సన్మానాలను రసవత్తరంగా కౌసల్య పిక్చర్స్ "నాగభైరవ" యాక్షన్ సస్పెన్స్ థ్రిల్లర్‌లో చిత్రీకరించారు డైరెక్టర్ కె. ఎస్. రెడ్డి. కౌసల్యా బుచ్చిరెడ్డి నిర్మాతగా భీమవరకు బుచ్చిరెడ్డి సమర్పించే ఈ చిత్రానికి పేరాల కథ, మాటలు రాశారు. చక్రవర్తి సంగీత దర్శకుడు.

## కృష్ణతో పి. సి. రెడ్డి దర్శకత్వంలో కోగంటి విశ్వేశ్వరరావు భారీచిత్రం

హీరో కృష్ణ పూజా కార్యక్రమ నిర్వహణ, నాయికలు జయసుధ, జయప్రదల దీపారాధనతో డిసెంబర్ 9న శ్రీ పంచవటి చిత్రాలయవారి "బంగారు కాపురం" చిత్రానికి ప్రారంభోత్సవం జరిగింది. రావుగోపాలరావు, గొల్లపూడి మారుతీరావు, అల్లు రామలింగయ్య, గిరిబాబు, ఎస్. వరలక్ష్మి, అన్నపూర్ణ, స్మిత, జయమాలిని, జ్యోతిలక్ష్మి ఇతర పాత్రధారులు. సత్యానంద్ సంభాషణలకర్త. ఆత్రేయ, వేటూరి గీతాలకు జె. వి. రాఘవులు స్వరకర్త, లక్ష్మణ్ గోరే ఛాయ, భాస్కరరాజు శిల్పం, కోగంటి విజయకుమార్ నిర్వహణ, మన్నెం రాధాకృష్ణ – రామసూరి సహదర్శకత్వం, కొత్తగడ్డ రామకృష్ణారావు నిర్మాణ సారథ్యంలో పి. చంద్రశేఖరరెడ్డి కథ, స్క్రీన్ ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు. "మొదటి షెడ్యూల్ జనవరి 27 నుంచి ఫిబ్రవరి 6 వరకు, ఊటీలో మార్చి 1 నుంచి

'ఇంటి గుట్టు'లో చంద్రమోహన్, సుహాసిని, నళిని, చిరంజీవి



'బావా మరదళ్లు' 



మా

వి.జి.



10 వరకు రెండవ షెడ్యూల్, మూడో షెడ్యూల్ ఏప్రిల్ 1 నుంచి 10 వరకు, మిగిలిన ఆరు రోజులపాటు షూటింగ్ మే లో జరుగుతుంది,'' అన్నారు నిర్మాత కోగంటి విశ్వేశ్వరరావు

## "సుందరి - సుబ్బారావు"

ఇప్పుడు ''శ్రీవారికి ప్రేమలేఖ'' చిత్రాన్ని నిర్మిస్తున్న ప్రముఖ పత్రికాధిపతి చెరుకూరి రామోజీరావు ఉషాకిరణ్ ఫిలిమ్స్ బానర్‌లో డిసెంబర్ 26 నుంచి పై చిత్రాన్ని ప్రారంభిస్తారు విజయశాంతి నాయిక రేలంగి నరసింహారావు దర్శకుడు

## పద్మాలయా స్టూడియోస్ సమర్పణలో అమృతా ఫిలిమ్స్ చిత్రం

'సెంటిమెంట్‌తో పాటు క్రయిమ్, యాక్షన్, సస్పెన్స్ అన్నీ ఉంటాయి,'' అన్నారు ఎం బాలయ్య ఈయన కథ స్క్రీన్‌ప్లే సమకూర్చి దర్శకత్వం వహించే చిత్రానికి డిసెంబర్ 22 న తొలిగీతం ధ్వనిముద్రితమైంది కృష్ణ, జయసుధ సత్యనారాయణ, గిరిబాబు, నూతన్‌ప్రసాద్, పద్మనాభం, ప్రసాద్ బాబు అన్నపూర్ణ నిర్మల, వగైరా నటవర్గం. డి వి నరస రాజు మాటలు రాశారు. సి నారాయణరెడ్డి, వేటూరి గీతాలకు చక్రవర్తి స్వరకర్త ఎం జి ఆర్ మణి ఛాయ, కె ఎల్ ధర్ శిల్పం సీను నృత్యాలు, ఎస్. పి. ఎస్ వీరప్ప ఫార్స్, కె రంగారావు--గంగాధర్ సహకార దర్శకత్వం, రవికుమార్ నిర్వహణలో తులసి రాంప్రసాద్ సహ నిర్మాత ఫిబ్రవరి 10న ప్రారంభమయ్యే షూటింగ్ మేలో పూర్తవుతుందనీ, జూన్‌లో విడుదల చేయదలచామనీ నిర్మాతలు అలపర్తి సూర్యనారాయణ, మన్నవ వెంకట్రావు తెలియజేశారు

## నందమూరిబాలకృష్ణ "డిస్కో కింగ్"

బొంబాయిలో రెండు సాంగ్స్‌ను డిసెంబర్ రెండవ వారంలో ఎక్స్‌రైజ్ చేశాం



బాలకృష్ణ 'డిస్కో కింగ్'

షూటింగ్ మూడు వంతులకు పైగా పూర్తయిపోయినట్లే,'' అన్నారు తాతినేని ప్రసాద్ ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ''డిస్కో డాన్సర్'' హిందీ హిట్ చిత్రం ఆధారంగా రాకేష్ నిర్మించే విష్ణు ఫిలిమ్స్ ''డిస్కో కింగ్' చిత్రంలో నందమూరి బాలకృష్ణ తులసి, జగ్గయ్య, నూతన్‌ప్రసాద్, సుధాకర్, అనుపమ ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు గణేష్ పాత్రో సంభాషణలు చక్రవర్తి సంగీతం సాయిప్రసాద్ ఛాయ కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పంతో తాండవకృష్ణ నిర్మాణ సారధి

శోభన్ బాబు, రాధిక



'గూండా'లో రాధ, చిరంజీవి





'అపరాధి'లో సుమన్, సుహాసిని

## "పుణ్యం కొద్దీ పురుషుడు" లో ఎవరి పెళ్ళిమిటి ఎవరు ?

రాధ ( రాధిక ) బొమ్మల కొలువుకు బొమ్మల్ని పేర్చి పెట్టింది వాళ్ళింటి గుమ్మం వరకు వచ్చిన సత్యభామ ( జయసుధ ) చీర కుచ్చెళ్ళు అడ్డు పడడంతో పడబోయింది

పక్కకు తిరిగిన రాధ తన కళ్ళను తానే నమ్మలేకపోయింది "ఏమే, సత్యా ! ఏమిటే ఇది ? అచ్చం మూరు పైసల తెలుగు ఆడపడు చులా తయారయ్యావ్ ?'

'ఏం చెయ్యనే ! 'బొమ్మల కొలువుకు వెళ్తున్నావ్—ఆ జీన్ పాంట్స్, టీ షర్ట్లు ఏమిటి చక్కగా చీర కట్టుకుని వెళ్ళకుండా ? పైగా, పెళ్ళి కూడా నిశ్చయమైంది రేపు పీటల మీద కూడా ఇలాగే కూర్చుంటావా ?'అని మా మమ్మీ పోరు పెట్టి, చీర కట్టి పంపింది "

'ఏమిటీ ! నీకు పెళ్ళి నిశ్చయమైందా ? అమ్మ దొంగా ! నాకు కనీసం మాట మాత్ర మైనా చెప్పలేదే ! సత్యా, సత్యా ! ప్లీజ్ ఆ అదృష్టవంతుడెవరో చెప్పవూ ? "

చెప్పడం కాదు చూపిస్తాను ఇద్దరం ఒకరినొకరు అర్థంచేసుకుని, మనసులు ఇచ్చి పుచ్చుకుని, ప్రేమించుకున్నాం "

'ఎప్పుడూ ? నీ పెళ్ళప్పుడా ? పోవే—పెద్ద బెట్టు చేస్తున్నావ్— నువ్వే మహా ప్రేమించి నట్టూ, అదేదో పెద్ద గొప్పైనట్టూ ఓస్ నేను నీకన్నా ముందు ఎప్పుడో ప్రేమించాను "

"కాయ్ ! కాయ్ ! "

"ఏం ? నేను ప్రేమించలేనా ? నన్ను ప్రేమించే వారుండరా ?"

"ఐతే, ఎవరో చెప్పవే ! '

'నేనెందుకు చెప్పాలి ? '

"నువ్వు నాకన్నా ముందు ప్రేమించావు గనుక "

"నువ్వు నాకన్నా ముందు పెళ్లి చేసుకో బోతున్నావు గనుక నువ్వే చెప్పాలి పోనీ — ' అంటూ రాధ కొలువులోని ఓ బొమ్మను చూపిస్తూ, "ఇంత చక్కగా ఉంటాడా ? ' అంది

షాట్ ఓ—కే' అయ్యాక, "తర్వాత ఇద్దరి మీదా 'చక్కని వాడంటే అనే సాంగ్ వస్తుంది" అన్నారు డైరెక్టర్ కట్టా సుబ్బారావు. ఈయన స్క్రీన్ప్లే, దర్శకత్వంలో వై. వి. రావ్ నిర్మించే రవిచిత్ర ఫిలిమ్స్ " పుణ్యంకొద్దీ పురుషుడు ' చిత్రంతో శోభన్బాబు హీరో రావు గోపాలరావు, ప్రభాకరరెడ్డి, అల్లు రామ లింగయ్య వేలు, భీమేశ్వరరావు, కె కె శర్మ, ధమ్, మిఠాయి చిట్టి గరగ, పెమ్మసాని రామకృష్ణ, సత్యరాజ్, ఎస్ వరలక్ష్మి, అనూరాధ, పుష్పలత, విజయలక్ష్మి గిరిజారాణి ఇతర పాత్రధారులు — బాలమురుగన్ కథకు పూసల సంభాషణలు కర్త ఆత్రేయ సి నారాయణరెడ్డి గీతాలకు సత్యం స్వరకల్ప చేశారు ఎ దేవరాజ్ ఛాయ, ఎం కృష్ణ శిల్పం, సలీమ్ నృత్యాలు, మాధవన్ స్టంట్లు ఎస్. రామకృష్ణ సహకార దర్శకత్వం, వి. సుందరం—కుప్పిలి వెంకటేశ్వరరావు నిర్వహణ. రాయ్—రెడ్డి సహాయ దర్శకత్వం నిర్వహిస్తున్నారు

'పుణ్యంకొద్దీ పురుషుడు'లో జయసుధ, శోభన్బాబు

# హిందీ చిత్ర విశేషాలు!

★ రాష్ట్రపతి శ్రీ జైల్‌సింగ్ మనుమడు ఇంద్రజిత్‌సింగ్ – రాజశ్రీ, సాధనా బ్రదర్స్, మిన్ మూవీస్‌వారి చిత్రాలలో ప్రధాన భూమికలకు బుక్ అయ్యాడు

★ "మరో ఆరు మాసాలలో నా మార్కెట్ ఏమౌతుందోనన్న భయంతోనే ఇంతకాలంగా ఈ పరిశ్రమలో గడుపుకొస్తున్నాను," అంటుంది నేపథ్యగాయని ఆశాభోంస్లే

★ అక్టోబర్ 18న ఢిల్లీలో "హద్‌సా" చిత్రం ప్రదర్శింపబడే రివాలీ థియేటర్‌లోని బాల్కనీలో ఒక ఆటంబాబు పటాసు కనుగొనబడింది అంతకు ముందు కొన్ని థియేటర్లలో సంభవించిన ప్రేలుళ్ళ మూలంగా ఢిల్లీలోని థియేటర్లకు వెళ్ళడానికి కొందరు ప్రేక్షకులు భయపడుతున్నారు కొన్ని థియేటర్లలో అసలు వసూళ్ళే లేవు ఓడియన్ థియేటర్ వద్ద ప్రతి ప్రేక్షకునీ తనిఖీచేసి మరీ లోనికి పంపుతున్నారట

★ మనోజ్‌కుమార్ మంగళ, శనివారాలనాడు షేవ్ చేసుకోడు ఎందుకని అడిగితే, "మా నాన్నగారు అలా పాటించేవారు దాన్ని నేను అనుసరిస్తున్నాను అంతే!" అంటాడట

★ హృషీకేశ్ ముఖర్జీ చిత్రం "బావర్చి", సత్యజిత్ రే చిత్రం "షత్రంజ్ కే ఖిలారీ" తొలి రీళ్ళలో అమితాబ్‌బచ్‌చన్ వ్యాఖ్యానం ఉంది ఇటీవల మత కలహాలపై ఇషాక్ సర్వాత్ అనే ఆయన తీసిన హ్రస్వ చిత్రంలో అమితాబ్‌చేత ఒక పద్యం, ఆరు నిమిషాల వ్యాఖ్యానం రికార్డు చేయబడ్డాయి

★ మనదేశంలో కాన్పూర్‌లోని "శీష్‌మహల్" థియేటర్ ఒక్కదానిలోనే కాంప్లిమెంటరీ పాస్‌లు అనుమతించబడవు అంతేగాక, ఈ థియేటర్లో గత ఇరవై ఏళ్ళుగా డిస్ట్రిబ్యూటర్ల వాటా 40 శాతం చొప్పున పర్సంటేజ్ పద్ధతిలోనే చిత్రాలు ప్రదర్శింబడుతున్నాయి

★ కొన్ని హిందీ చిత్రాల పేర్లలో 'రామ్', 'ఏక్', 'ఏ' ఉంటున్నాయి మచ్చుకి కొన్ని "రామ్ తేరీ గంగా మైలీ, రామ్ తేరే కిత్నే నామ్, రామ్ కా దేశ్, రామ్ కా భాయ్ లక్ష్మణ్, రామ్ కలి, లల్లూరామ్"

"ఏక్ చిట్టీ ప్యార్ భరీ, ఏక్ ఔర్ సికిందర్, ఏక్ ఢాకూ షహర్ మేఁ, ఏక్ దిన్ బహూకా, ఏక్ నయా పహేలీ, ఏక్ నయా ఇతహాస్, ఏక్ నయారిష్తా, ఏక్ సే భలే దో"

"ఏ గులిస్తాన్ హమారా, ఏ కైసా ఇన్సాఫ్, ఏ కైసే నషా హైఁ, ఏ దిల్ కిస్కోడూన్, ఏ వాదా రహా, ఏ ఇష్క్ నహీ ఆసాన్, ఏ తో కమల్ హోగయా" చిత్రాలు ఫ్లాప్‌లు అయితే, "ఏ రాస్తే ప్యార్ కె, ఏ రాత్ ఫిర్ నహీ ఆయేగీ విజయవంతమయ్యాయి ఇప్పుడు కొత్తగా "ఏ దేశ్, ఏ హై బొంబాయ్ ప్యారీ, ఏ కైసే మిలన్" పేర్లతో చిత్రాలు తయారవుతున్నాయి

★ "కూలీ" చిత్రంలో అమితాబ్‌బచ్‌చన్ ప్రమాదానికి లోనైన సీన్‌లో "ఈ సీన్‌లోనే మా హీరోకు ప్రమాదం సంభవించింది," అనే టైటిల్ కార్డు చూపించబడుతుందట

★ చదువునె రోజుల్లో శశికపూర్‌కు సంస్కృతం పార్యభాగం కాని, అతనికి ఆ భాష ఒంటబట్టేది కాదు అన్ని సబ్జెక్టులలో ఫస్టు మార్కులు వచ్చినా సంస్కృతంలో మాత్రం సున్న అందుకే చదువుకు తిలోదకాలిచ్చేసి, సినిమారంగంలో ప్రవేశించాడు ఇప్పుడాయన "మృచ్ఛకటిక" సంస్కృత నాటకాన్ని హిందీలో నిర్మిస్తున్నాడు! ★

# తారలు - తీరులు

★ అనూరాధ ఇటీవల "ఎన్ వాళ్ళు ఉన్నోడు దాన్" తమిళ చిత్రం ఔట్‌డోర్ షూటింగ్‌కు కోయంబత్తూరు వెళ్ళినప్పుడు ఒక సంఘటన జరిగింది ఒక సాయంత్రం గుంపును తోసుకొని ఒక అభిమాని ఆమె దగ్గరికి వచ్చాడు అతకు తెల్ల ఫుల్ షర్టు, తెల్ల పైజామాతో ఆస్పత్రి నుంచి పారిపోయివచ్చిన రోగిలా ఉన్నాడు ఆ విషయం గురించి అనూరాధ అడిగితే, అతను జవాబివ్వకుండా ఆమెనే ఎన్నో ప్రశ్నలడగసాగాడు ఇంతలో అతని కోసం గాలిస్తూ అక్కడికొచ్చిన ఓ నడివయస్కులు "ఈ అబ్బాయికి పోయిన వారమే మేజర్ ఆపరేషన్ జరిగింది ఇరవై రోజుల వరకూ బెడ్ మీదే ఉండాలని నర్సులు ఎంతగానో హెచ్చరించారు కాని, వీడు మీరిక్కడి కొచ్చారని తెలిసి, మా కళ్ళు కప్పి పారిపోయి వచ్చాడు" అన్నాడట

"నా మనసు చివుక్కుమంది అతనికి కొంత డబ్బిచ్చి, వెంటనే ఆస్పత్రికి వెళ్ళి బెడ్ మీద రెస్టు తీసుకోమని చెప్పాను ఇలా కూడా ఉంటారా అభిమానులు !" అంటూ అనూరాధ నిట్టూర్చింది

★ సుహాసిని ఇంతవరకు ఎన్నో చిత్రాలలో నటించినా ఆమె బాబాయ్ కమల్‌హాసన్ ఎన్నడూ మెచ్చుకోలేదట కాని, ఇటీవల ఆమె నటించిన తొలి కన్నడ చిత్రంలో స్టంట్ సీన్‌లలో కొన్ని దెబ్బలు తగిలాయి ఆ గాయలతో ఇంటికి వచ్చిన ఆమెను తొలిసారిగా కమల్ హాసన్ మెచ్చుకున్నాడట "నువ్వు తీసుకునే పారితోషికానికి తగనట్లు నువ్వు శ్రమించింది ఇప్పుడే ఇలాంటి దెబ్బలు ఎన్నో తినే నేడు నేనింతవాడ్నయ్యాను" అన్నాడు కమల్

★ మార్చి నెలలో నటి సులక్షణ శ్రీమతి కాబోతోంది సంగీత దర్శకుడు ఎం ఎస్ విశ్వనాథం జ్యేష్టపుత్రుడు గోపీకృష్ణ వరుడు ఈ శుభవార్త మొదట ఈ నోటా ఆనోటా ప్రాకిందేకాని, ఇద్దరి పెద్దలూ అబద్ధమని చెప్పారు ఇప్పుడు వారు చెప్పిందే అబద్ధమైంది ఇదివరకు కాస్త విరక్తితో కనిపించే సులక్షణ ఇప్పుడు ఎంతో ఉత్సాహంగా కనిపిస్తోంది "మా వారు, నా యిల్లు" అనే మాటలను తరుచు ప్రయోగిస్తోంది మామగారంటే ఎంతో గౌరవం "గోపీకృష్ణగారి లాంటి భర్త దొరకటం నా పూర్వ జన్మ సుకృతం హి ఈస్ స్టబ్బర్న్ ! నా కోసం ఏం చేయడానికైనా సిద్ధమే నేనే ఆయనకు సర్వస్వం—అంటారు త్వరలోనే ఫిలిమ్ ఫీల్డుకు గుడ్‌బై చెప్పబోతున్నాను ఇంతవరకు చేసిన కళాసేవ చాలు ఇక మా వారు, నా ఇల్లు నా పిల్లలు వేరే ప్రపంచంలేదు" అనే సులక్షణకు చాలా మంది ముందుగానే శుభాకాంక్షలు అందజేసేశారు

★ "చండి చాముండి" వగైరా చిత్రాల్లో నటించిన బిందు ఘోష్ ఒకప్పుడు నటి నళిని తండ్రి డాన్స్‌డైరెక్టర్ వైకోం మూర్తి వద్ద కంపోజింగ్ అసిస్టెంట్‌గా పనిచేసింది ఇదివరకు బక్కపల్చగా ఉన్న ఈమె రెండో కాన్పు అయ్యాకే విపరీతంగా లావెక్కిపోయిందట ఈమె పెద్ద కొడుకు వయసు పదేళ్ళు

★ "ఒక మలయాళం చిత్రం షూటింగ్‌కు పారిస్ వెళొచ్చాను" అంది పూర్ణిమా జయరాం అక్కడ దివంగితురాలైన సెక్సీక్వీన్ మెర్లిన్ మన్రో 'లైఫ్‌సైజ్' పోస్టర్స్‌ను అమ్ముతున్నారట "ఖరీదు నాలుగువేల డాలర్లు ! కొందామనుకున్నాను గాని, వీలుపడిందికాదు!" అందామె

★ "నాకు చాలా కాలంగా లేడీ పోలీస్‌గా ఒక చిత్రంలో నటించాలని ఉంది ఇదివరకు రౌడీ పిల్ల వేషం వేయాలనే ఆశ కూడా ఉండేది ఇప్పుడా ఆశ లేదు !" అంది సుజాత






### కె. డి. బి. — మచిలీపట్నం

పిల్లల్ని కట్టుదిట్టంగా పెంచితే— వారి అభిరుచులు సమాధి కావచ్చు అలా అని స్వేచ్ఛ యిస్తే పాడవవచ్చు, పెద్ద సమస్య అయి కూర్చుంది

★ క్రమశిక్షణ అన్నది చాలా సున్నితమైన మాట పెద్ద వాళ్లం కదా అని పిల్లలతో సెన్సిబుల్‌గా మాట్లాడడం మాని — అదర కొడతాం అస్సలు ఎదురు తిరగాలన్నది అప్పడే పుట్టుకొస్తుంది అరవటం కాదు మాట్లాడడం కొట్టడం కాదు— పనిష్ చేయడం ముందు పెద్దలు నేర్చుకోవాలి అప్పుడు పిల్లలు తమంతట తామే— మన దారికి వస్తారు

### జి. వి. పి. — ఆదోని

మానవుడు వివేకి ఎలా అవుతాడు?

★ హృదయంతో కాకుండా బుర్రతో ఆలోచించడం ప్రారంభించినపుడే— వివేకి అయ్యేది

సంపన్నులై వుండి సంపన్నులు కాని వారెవరు ?

★ ఉండి అనుభవించని వాళ్లు అనుభవించలేనివాళ్లు

### జి. ఎల్. బి — ఖర్గపూరు

నేను ఏ మాట అయినా సరే యదార్థంగా అంటాను— నన్ను అంతా మంచి అమ్మాయేగాని గయ్యాళి అంటారు నన్ను మంచిగా అనుకుందుకు దారి చెప్పండి ?

★ మంచితనానికి కాస్తైనా గయ్యాళి పేరు లేకపోతే— చేతకానితనంగా జమకడతారు అందుచేత— ఒకరిచేత మంచి అనిపించుకుందుకు ప్రయత్నం చేసేకంటే— మంచిగా వుండడమే — మంచిది చిట్టితల్లీ

### వి. వి. కె — హైదరాబాదు

నేటి చిత్రములపై మీ అభిప్రాయం ఏమిటి ? డబ్బు కోసం తీస్తున్నారా ? మంచి రక్తి కట్టెడి త్యాగం కల ప్రేమను, రాగం కల సినిమాలు తీస్తే మేలు కదా ?

★ ప్రేక్షక బుద్ధి మరీ ఊసరవెల్లి రంగులు మార్చినట్టు మారిపోతూంది అంచేత త్యాగం, రాగం తరవాత చూసుకోవచ్చు — ముందు డబ్బు రానీ — అని సినిమాలు తీస్తున్నారు

### ఎం. కె. — విశాఖ

నాకు తెలియక అడుగుతాను, చిరంజీవులలో కూడా గొప్పవాళ్లూ బీదవాళ్లూ ఉంటారా ?

★ ఎందుకుండరు ? గొప్ప చిరంజీవి, బీద చిరంజీవి ! ( సినిమా స్టార్ కాదు — దీర్ఘ వయస్కుడు—నేనంటున్నది ! )

### కె. సి. ఆర్. — మైదుకూరు

ఈ సమాజంలో సమస్యలు అన్నిచోట్ల విలయతాండవం చేస్తున్నాయి కదా అలాంటి సమస్యలను తీసుకుని కథా రచన చేయకలరా ?

★ చేయవచ్చు కాని చదివేది ఎవరని ? !

### ఎ. ఎస్ — దొడ్డిపట్ల

పరుగెత్తి పాలు తాగుదామంటే పాలు దొరకడంలేదు నిలబడి నీళ్లు తాగుదామంటే నీళ్లు లేవు ఎలాగ ?

★ ఓర్చిన పశువుకు తేటనీరు అన్నారు — వినలేదా ? ఓపికపట్టడమే

### ఎం. ఎస్. — నంద్యాల

మనిషికి మనసు వ్యతిరేకమైతే ?

★ నరకంలో బ్రతుకుతాడు

ఎవరి సానుభూతి లేని ఉద్యోగం ?

★ భార్యలది !

ఆత్మ శరీరానికి లొంగుతుందా ?

★ లొంగిపోదు కాని, అప్పుడప్పుడు కళ్లు మూసుకుంటుంది

### జి. వి. ఆర్. — కాకినాడ

అబద్ధాలకోరుకి, గొప్పలు చెప్పేవాడికి ఏమిటి తేడా ?

★ ఏంలేదు ఇద్దరూ దగ్గిర బంధువులే

### డి. ఎస్. ఆర్. — సత్తుపల్లి

మీరు ఆడువారు కదా అందుకని ఆడవారి సమస్యలు ఎక్కువగా పరిష్కరిస్తారు కదా నిజమేనా ?

★ ఆడవారి చుట్టూనే కద — సమస్య లుండేది ? !

### ఎ. వి. జి. ఎస్. హెచ్. — చీరాల

కాని జీవితం అసంతృప్తిగాను, అగమ్య గోచరంగాను, ఆందోళన మయంగాను ఉంది మీ సలహా—

★ స్నేహశీలి, మంచి మనసున్న డాక్టరుతో కూర్చుని మీ మనసులో బాధ చెప్పండి వారే — మీకు దారి చూపిస్తారు

### సురేంద్ర — ఆదోని

అక్కయ్యా, పెళ్లి అనేది కామెడీయా ? ట్రాజెడీయా ?

★ అది మీ చేతుల్లోనే వుంటుంది ఈ నాటకంలో ముగింపు ఎవరికి తోచినట్టు వారు రాసుకోవచ్చు

### ఆర్. పి. — భీమిలి

స్త్రీ పురుషులు ఒక్కటిగా పెనవేసే శక్తి దేనికి వుంది ?

★ సెక్సుకి !!



ప్రముఖ సినీనటి శ్రీమతి జమున నల్లగొండజిల్లా గ్రంథాలయ వారోత్సవ సభలో ముఖ్యఅతిథిగా పాల్గొని ప్రసంగిస్తున్న దృశ్యం గ్రంథాలయ అధ్యక్షులు శ్రీ జె మార్కండేయ, కలెక్టర్ సతీమణి శ్రీమతి సంధ్యానాయుడు గార్లని చిత్రంలో చూడవచ్చు



# అనుబంధం

## రావినూతల సువర్ణా కన్నన్

మధ్యాహ్నం పన్నెండు గంటల సమయం

రోహిణీ కార్తె ఎండ తన ప్రతాపాన్ని చూపిస్తోంది

ఆదివారం కావడం మూలాన ఎండకి భయపడి పిల్లా పెద్దా అంతా ఇళ్లల్లోనే ఉండి పోయారు

నిర్మానుష్యంగా వున్న రోడ్డుమీద, నడిపీట నావలా నిల్చుండిపోయాడు కోటిగాడు వంటరిగా

''పాలైస్ ! '' అంటూ గట్టిగా అరిచి పిల్లలకోసం ఆశగా చూశాడు

ప్రతిరోజూ వాడి కేక వినగానే చుట్టు ముట్టే పిల్లలు ఒక్కరూ ఈరోజు రాలేదు

కారణం ఆ రోజు స్కూల్ లేకపోవడమే

కోటిగాడి ముఖం చిన్నబోయింది !

వాడికి దాదాపు పదేళ్లుంటాయి !

తిండి సరిగ్గా లేకపోయినా అదోరకమైన దర్జా కనిపిస్తూంది వాడి ముఖంలో

తల్లి వాడికి తెలియనే తెలియదు— తండ్రి అంతకంటే తెలియదు !

ఒక్క అవ్వ మాత్రం తెలుసు !

ఆమె వాడికి తల్లీ, తండ్రీ !

ఒకే కూతురు, తన బిడ్డని తల్లి చేతుల్లో పెట్టి కన్నుమూస్తే, ఆ పసిగుడ్డును కడుపులో పెట్టుకుని కూతురి మరణపు దుఃఖాన్ని దిగ మింగింది అవ్వ

తను కూలికెళ్తూ ఎలాగో ఇన్నాళ్లు వాణ్ణి పెంచింది కానీ వృధ్యాప్యం, హఠాత్తుగా ఆక్రమించేసిన శత్రుసేనలా ఆమెనాక్రమించేసరికి ఇప్పుడు కూలీ నాలీ చేసుకోవడం ఆమెకి కష్టతరమైపోయింది !

అందుకే, ఇటీవల మనవణ్ణి, వాళ్లకాళ్లూ వీళ్లకాళ్లు పట్టుకుని ఓ చోట పనికుదిర్చింది

అది బండి మీద అయిస్ ఫ్రూట్స్ అమ్మడం ఉదయం బయల్దేరి సాయంత్రం దాకా అమ్మితే అమ్మినదాన్నిబట్టి కమీషన్ ఇస్తాడు యజమాని

అయితే యజమాని మాత్రం చండ శాసనుడు ప్రాణం పోతున్నా ఒక్క పైసా ఇవ్వడు సరిగదా పసివాడు ఓ ఐస్‌ఫ్రూట్ కావాలని అడిగినా ఇవ్వడు

అందుకే ఆయన స్వభావం తెలిసిన అవ్వా మనవడు అలాంటి ఆశలేం పెట్టుకోరు

అయితే మూడురోజుల నుంచీ అవ్వకు జ్వరంగా వుండి, పన్లోకెళ్ళడంలేదు కోటిగాడు తెచ్చింది ఇద్దరికీ చెరో బన్, టీ నీళ్ళు తప్ప మరేం ఇవ్వలేకపోయింది !

ఈరోజు అదీ దొరికేట్టు లేదు

ఉదయం నుంచి రెండు మూడు ఐస్ ఫ్రూట్స్ తప్ప అమ్మలేకపోయాడు కోటిగాడు

అరిచి అరిచి నోరు, నడిచి ంచి కాళ్ళూ పడిపోయాయి

ఎండకి ముఖమంతా కందిపోయింది !

చెప్పుల్లేని కాళ్ళు బొబ్బలెక్కిపోయాయి !

ఆకలితో పేగులు అరుస్తున్నాయి !

చెవులు ఘడియలు పడుతున్నాయి !

అడుగుతీసి అడుగు పెట్టడమే కష్టంగా ఉన్న సమయంలో ఏం చెయ్యాలో ఆ పసివాడికి అర్థంకాలేదు అసలు ఇల్లెలా చేరాలో కూడా తోచలేదు

ఒక్క అయిస్‌ఫ్రూట్ తినాలని ఎంతగానో అనిపించింది అయితే యజమాని ఉగ్ర నరసింహావతారం గుర్తొచ్చి ఆ ప్రయత్నాన్ని విరమించుకొన్నాడు

నీరసంతో కళ్ళు తిరుగుతున్నట్లనిపించి ఓ విశాలమైన భవంతి ముందున్న పెద్ద చెట్టు నీడలో కూలపడ్డాడు కోటిగాడు

అప్రయత్నంగా ''అమ్మా !'' అన్న పదం అతని లేత పెదవుల నుంచి వెలువడింది

ఎందుకో రూపం తెలియని అమ్మ గుర్తొచ్చి వాడి కళ్ళు నీటితో నిండిపోయాయి !

చిరిగిన చొక్కాతో కళ్ళు, ముఖానికి పట్టిన చెమట తుడుచుకుంటూ, విశాలమైన ఆవరణలో అందంగా, మరింత ఠీవిగా నిల్చున్న ఆ భవనానికేసి చూశాడు

మూసిన ఇనపగేట్లోంచి రకరకాల పూల

# అనుబంధం

మొక్కలు బారులుతీరి ఆహ్వానిస్తున్నట్లు కనిపించాయి !

గేటు లోపలివైపు ఘూర్ఖా ఓ చెట్టు నీడన బీడీ వూత్తూ కూర్చున్నాడు

ఓ నౌకరు తోడేల్లాంటి కుక్కకి బిస్కెట్లు తినిపిస్తున్నాడు

పనిమనిషి కాబోలు మెల్లగా గేటు తీసుకుని బైటికొచ్చి చేతిలోని బుట్ట చెత్తకుండీలోకి వంపింది

అన్నం, కూరలు చెత్త చెదారం కలిసిన ఆ కూటికోసం నాలుగు కుక్కలు పరుగున వచ్చి తినబోయి అవి నోటికి చిక్కక కాట్లాడుకుంటున్నాయి

అదంతా చూస్తున్న ఆ చిన్నారి మనసులో ఎన్నో అనుమానాలు !

మరెన్నో ప్రశ్నలు !

జవాబులేని ప్రశ్నలు !

"పెద్ద పెద్ద భవంతుల్లేకపోయినా తమకి కనీసం మంచి గుడిశైనా లేదెందుకు ?

పంచభక్ష పరమాన్నాలు లేకపోయినా ఆకలి తీర్చుకునేందుకింత అంబలైనా లేదెందుకు ? శిథిలమైన గుడిశల్లో ఆకలితో, చలితో, తాము ముడుచుకు పడుకుంటే రాజభవనాల్లాంటి ఇళ్ళల్లో పట్టు పరుపుల మీద తిన్నదరక్క పడి దొర్లే బాబులెందుకున్నారు ?

ఆ పాడు దేవుడసలీ తేడా లెందుకు పెట్టాడు ? తోడేల్లాంటి కుక్కకి బ్రతిమాలి బిస్కెట్లు తినిపిస్తుంటే, బక్కచిక్కిన ఈ కుక్కలకి ఈ పాట్లేమిటి ? ఈ మారాజులు కంచాల్లో పారేసిన అన్నంతో తనూ, మామ్మేకాక మరో నలుగురు హాయిగా తినచ్చే ! అంత నేలపాలు చెయ్యడమెందుకు ?

కనీసం చెల్లాచెదురుగా పారెయ్యకుండా ఓ చోట పెడితే ఆ కుక్కల ఆకలైనా తీరేది కాదా?"

ఆకలికి తట్టుకోలేని ఆ పసి మనసు ఇలా ఆలోచిస్తుంటే –

అదే మేడ పై అంతస్తులోని ఎ సి రూమ్‌లో పడుకున్న డాక్టరు ఆనందరావు ఏకైక పుత్రరత్నం అయిన పదేళ్ళ రమేష్ పై కిటికీ అద్దాల్లోంచి చెట్టుకింది అయిస్ బండీని చూసి మెల్లగా తల్లి శకుంతల దగ్గరికి చేరాడు – "మమ్మీ !" అంటూ

"ఏమిటీ ?" అందామె నిద్రలోంచే

"మమ్మీ ! ఒక్కసారి లే !" మెల్లగా అన్నాడు రమేష్

"ఏమిటి గొడవ ! పడుకో !" విసుగ్గా అంది కళ్ళు తెరవకుండానే శకుంతల

"అదికాదమ్మా ! నాకు పాలైస్ కావాలి" గోముగా అడిగాడు రమేష్

"దానికి నన్నడగడం దేనికి ? వెళ్ళి ఫ్రిజ్ లోంచి తెచ్చుకో !" అంది మరోవైపుకి వత్తిగిలుతూ

"అది కాదు" గొణిగాడు రమేష్

"మరేది ?"

"వీధిలో అమ్మే పాలైస్ కావాలి !" మెల్లిగా అన్నాడు

"ఏమిటి ?" అంది శకుంతల కళ్ళు పెద్దవి చేసి ఆమె నిద్రకాస్తా ఎగిరి చక్కాపోయింది.

"వీధిలో అమ్మే పాలైస్ "

అతని మాట పూర్తికానేలేదు చటుక్కున లేచి కొడుకు నోరు మూసేసింది శకుంతల, ఆ మాట భర్త చెవిని ఎక్కడ పడుతుందో అని అయినా –

"ఏమిటి ?" అన్నాడు ఆనందరావోసారి కళ్ళు తెరిచి

"అహఁ ! మరేంలేదు ! మీరు పడుకోండి !" అనేసి, మెల్లగా లేచి ఫ్రిజ్‌లోంచి అయిస్‌క్రీం తెచ్చి కొడుక్కిచ్చింది శకుంతల

ఎంత మంచి వస్తువైనా వీధిలో కొంటే భర్త కిష్టం వుండదని ఆమెకి బాగా తెలుసు

"ఇది నాకొద్దు ! ఆ పాలైసే కావాలి !" కిటికీ దగ్గరికొచ్చి మెల్లగా అన్నాడు రమేష్

శకుంతల కూడా కిటికీ దగ్గరికొచ్చి అయిస్‌ఫ్రూట్ బండీని చూసింది

"నా మాట విను నాన్నా ! అసలది నిజంగా పాలైస్ కాదు ! వట్టినీళ్ళతో చేస్తారు ! మనింట్లో వున్నదే ఎంచక్క మంచి ఆయిస్‌క్రీం !" నచ్చచెప్పబోయింది

"అయినా నాకదే కావాలి !" మరీ పసివాడిలా మొండిగా అన్నాడు రమేష్

"ఏమిటీ గొడవ ?" విసుగ్గా అన్నాడు ఆనందరావు

"డేడీ ! నాకు వీధిలో అమ్మే పాలైస్ కావాలి !" ఎప్పుడూ లేనంత ధైర్యంగా అడిగాడు రమేష్

తల్లీ కొడుకుల సంభాషణ విన్న ఆనందరావు అంతగా ఆశ్చర్యపోలేదు అందుకే –

"వద్దు నాన్నా ! అలాంటివి తింటే జబ్బులొస్తాయి !" సౌమ్యంగానే అన్నాడు

"అదికాదు డేడీ ! వాటిమీద మూతుంటుంది నిజం ! కావాలంటే చూడు !" అన్నాడు రమేష్

క్షణం ఆలోచనలో పడ్డ ఆనందరావు –

"మనం ఎంచక్కా హోటల్‌కెళ్ళి" అంటూ ఏదో నచ్చచెప్పబోయాడు

కానీ రమేష్ విన్లేదు !

"ప్లీజ్ ! డేడీ ! ఈ ఒక్కసారే ! ఇంకెప్పుడు అడగనుగా!" అన్నాడు బ్రతిమాలుతూ

నిన్న తన ఫ్రెండ్ సుధీర్ తినడం చూసిన దగ్గర్నించి అతనికా పాలైస్ తినాలని మహ ఆశగా ఉంది

గత్యంతరలేని ఆనందరావు –

"సరే ! వాణ్ణిలా రమ్మను !" అన్నాడు

రమేష్ ముఖం వెలిగిపోయింది !

శకుంతల తెల్లబోయింది !

"ఆగు ! . ఎండలోకి నువ్వెళ్ళకు ! వాణ్ణే ఇలా మెట్లమీదికి తెమ్మను!" అన్నాడు ఆనందరావు కొడుకు పరిగెత్తడం చూసి

"పర్లేదు డేడీ ! ఇప్పుడే వచ్చేస్తానుగా!" అంటూ నిమిషంలో మాయమయ్యాడు రమేష్

ఇటీవల మదరాసు విల్లివాకం తెలుగు పఠన మందిరం వారి 21వ వార్షికోత్సవంలో హీరో కృష్ణ ప్రసంగిస్తున్న దృశ్యం శ్రీమతి విజయనిర్మల, శ్రీ ఎల్ వి రామయ్య, డా సి ముద్దు కృష్ణారెడ్డి, డా సి మోహనరెడ్డి గార్లని చిత్రంలో చూడవచ్చు



"ఏయ్ పాలైస్ !  "

నిస్త్రాణగా చెట్టుకానుకుని కూర్చున్న కోటిగాడు తృళ్ళిపడి చూశాడు

"ఏయ్ ! ఇలారా !" లోపల్నించే చెయ్యి ఊపుతూ అన్నాడు రమేష్

కోటిగాడి కళ్ళు తళుక్కుమన్నాయి !

ఆ పిలుపు వాడికి పన్నీటి చినుకులా తోచింది

ఎక్కడలేని ఓపికా వచ్చింది !

చటుక్కున లేచి ఘూర్ఖా తీసిన గేట్లోంచి పాలైస్ బండిని లోపలికి తీసికెళ్ళాడు

"మంచివేనా ?" దర్పంగా అడిగాడు రమేష్

"ఆ ! మంచియ్యే బాబుగోరూ ! ఒక్కసారి తింటే మరిడవరు ఎన్నిను ?" ఉత్సాహంగా అన్నాడు కోటిగాడు

"రెండివ్వు చాలు !" అన్నాడు రమేష్

కోటిగాడు పెట్టె మూతతీసి రెండయిస్ఫ్రూట్స్ జాగ్రత్తగా తీసి రమేష్‌కిచ్చాడు

"ఆగు !" అన్న గర్జనకి తృళ్ళిపడ్డారు పిల్లలిద్దరూ

"ఏమిటీ చేతులనిండా ?" వస్తూ చిరాగ్గా అన్నాడు ఆనందరావు

చేతులు చూసుకున్నాడు కోటిగాడు అవి ఎర్రగా రంగు పూసినట్లున్నాయి

"ఏం నేదు బాబూ ! అయిసుపూటు రంగు !" తేలిగ్గా అనేశాడు

"ఛ ! ఛ ! డర్టీఫెలో ! అలా చేత్తోనా తీసేది ?" అసహ్యంగా చూస్తూ అన్నాడు ఆనందరావు

"మరి సేత్తోనేగా బాబూ తియ్యాలా!" అమాయకంగా అడిగాడు కోటిగాడు

"నోరు ముయ్యి ! వెధవ తెలివి తేటలు ! " అకారణంగా మండిపడ్డాడు ఆనందరావు

దీనంగా చూశాడు కోటిగాడు

రమేష్ అర్థరూపాయి బిళ్ళతీసి వాడికి ఇవ్వబోయాడు

"రమేష్ !" మరోసారి అరిచాడు ఆనందరావు

"ఏమిటి డేడీ ? " బిత్తరపోయాడా పిల్లాడు

"ఆ అయిస్ అక్కడ పడై !"

"ఎ ఎందుకు డేడీ ?"

"ముందు చెప్పిన పని చెయ్యి !" మండిపడ్డాడు ఆనందరావు

"అదేమిటండి ! పిల్లి కొని ఇప్పుడు కాదంటే ఏం బావుంటుంది ? ఆఁ ! నువ్వెళ్ళు రమేష్! " అంది శకుంతల కల్పించుకుంటూ

"వీల్లేదు ! ఆ అయిస్ కొనడానికి వీల్లేదు ! ముందు వాణ్ణి అవతలికి గెంటెయ్యి!" కొడుకు చేతిలోని ఐస్‌ఫ్రూట్స్ రెండూ లాక్కుని పెట్టెమీద పడేశాడు ఆనందరావు

"బాబూ ! సెయ్యి కడుక్కుని మళ్లీ తీసిత్తాను !" కంగారుగా అన్నాడు కోటిగాడు

వాడికా బేరం ఎక్కడపోతుందో అన్న బెంగ నరనరాల్నీ ఒణికించేలా చేస్తోంది

"అవసరం లేదు ! నువ్వెళ్ళిపో !" కఠినంగా అనేసి వెనుతిరిగాడు ఆనందరావు

భర్త ప్రవర్తనకి విస్తుపోయింది శకుంతల

రమేష్ కొత్త వ్యక్తిని చూస్తున్నట్టు చూస్తుండిపోయాడు, తండ్రిని

కోటిగాడు కృంగిపోయాడు

వాడిలోని అవసరం అభిమానాన్ని అవతలికి నెట్టింది

"బాబుగోరూ! అలా అనొద్దు బాబుగోరూ! పొద్దున్నించీ ఏం తిన్నేదు ! అన్నం తిని మూడ్రోజులైంది ! మా యవ్వకు జొరం ! " అన్నాడు దయనీయంగా

వాడి మాటలు విన్న ఆనందరావుకి జాలికన్నా కోపమే ఎక్కువ వచ్చింది

"అయితే ఏమంటావ్ ?" అన్నాడు కఠినంగా

"తఁవఁరియ్యి కొంటే ఓ అద్దు రూపాయొస్తది అయ్యేట్టి నేనూ, మా మాయమ్మ టీ నీల్లు తాగుతాం" వాడి కళ్ళలో నీళ్ళూరి టపటప చొక్కామీదికి రాల్తున్నాయి

"అయితే ఇది తీసుకో ! అంతేగానీ నీ వెధవచేతి తిండి మా కక్కర్లేదు !" అర్థరూపాయి బిళ్ల విసిరేస్తూ మేడ మెట్లవైపు తిరిగాడు ఆనందరావు

ఆ నాణెం వాడి ముఖానికి తగిలి నుదుట పెద్ద బొప్పికట్టింది

కోటిగాడిలో అభిమానం పొంగింది!

ఆశ కృంగింది !

నిరాశ ఆకలిని రెచ్చగొట్టింది !

ఆ ఆకలి ఆవేశాన్ని తట్టిలేపింది !

ఆవేశం ఉచితానుచితాల్ని మర్చిపోయింది !

"ఉంచుకో ! అదీ నువ్వే వుంచుకో ! కాదంటే ఏ బిచ్చగాడికో దానం చేసుకో ! నాకు తిండి లేకపోయినా అబిమానం ఉంది! నీలా లచ్చలు నేపోయినా లచ్చలు సేసే దయాగునం ఉంది ! ఇంతమంది నౌకర్లు నేపోయినా కొండంత మామ్మంది ! మేం తినకపోయినా కూసంతుంటే, పసిపాణం ఆకలితో అల్లాడి పోతుంటే సూస్తూ ఊరుకోం ! అలాటిది లచ్చలుండి ఓ అద్దు రూపాయ్ కాడ యనకాడావ్ ! నువ్వూ ఓ మొగాడివే ! కట్టు ! మరో మేడ కట్టు ! "



తన్నుకొస్తున్న దుఃఖాన్ని బలవంతంగా దిగమింగుతూ ఆవేశంగా అరిచి బండి మీద చేతు లేశాడు కోటి తోసుకెళ్లడానికి అంతే! వాడు వెళ్లి అల్లంత దూరాన పడ్డాడు

అయిస్‌ఫ్రూట్సన్నీ నేలపాలైపోయాయి!

"రాస్కెల్! ఏంకూశావ్‌రా? పైసాకి గతిలేని వెధవ్వి! నన్ను పట్టుకుని ఇన్ని మాట్లంటావ్‌రా నువ్వెంత! నీ బతు కెంత! నిన్నీ రోడ్డుమీద పడేసి పిచ్చికుక్కని కొట్టినట్టు కొడితే నీ తాతెవడొస్తాడో చూస్తాను!" అంటూ ఆవేశంగా ఎడాపెడా బాదేశాడు ఆనందరావు

"ఏమిటీ అన్యాయం?" శకుంతల అడ్డం వచ్చింది

"నువ్వురే! ఇవాళ వీడి రక్తం కళ్ల చూస్తాను! ఆఫ్‌టాల్! వెధవ వేలెడు లేదు నన్నింతలేసి మాటలంటాడా!" లుంగలు చుట్టుకుపోతున్న వాడి కాలర్ పట్టుకుని లేవదీసి మరి నాలుగు దెబ్బలు వేశాడు

శకుంతల లోని మాతృత్వం ఈ అన్యాయాన్ని సహించలేకపోయింది

"ఏమిటి? మీకేమైనా మతిపోయిందా? అన్నం పున్నెం తెలియని పసివెధవ ఏదో ఆకలి బాధతో అంటే ఇన్నేళ్ళొచ్చి దయ, జాలి అన్న పదాల కర్థం మర్చిపోయి అలా కొడతారా? ఇప్పుడు వాడికేమైనా అయితే? నిజమైన బాధతో ఎవరైనాఅంటే అది మనకి కచ్చితంగా తగిలి తీరుతుంది జాగ్రత్త!" కాళిలా అరుస్తున్న శకుంతలని ఆనందరావు, రమేషే కాక నౌకర్లంతా కూడా వింతగా చూస్తూండి పోయారు!

కోటిగాడికి మాత్రం అవేం వినిపించడం లేదు! కనిపించడం లేదు!

దాదాపు స్పృహలేనట్టు పడివున్న వాడి కళ్ళకి నేలపాలైన పాలైస్‌లు మాత్రం దీనంగా కనిపిస్తున్నాయి!

వాడికి దెబ్బల బాధగానీ, ఆకలి బాధగానీ అస్సలు గుర్తులేవు!

వాడికి గుర్తున్నదల్లా యజమాని రూపం!

ఆగ్రహంతో మండిపడే రూపం!

వాలిపోతున్న కళ్ళు ఓసారి తెరిచి అయిస్ బండికేసి చూశాడు

అయిస్ కరిగి ఆ ప్రాంతమంతా తడిగా అయిపోతోంది

ఎలాగైనా లేచి మిగిలినవాటిని ఏరి డబ్బాలో వేసుకుందామని అనుకున్నా వాడి శరీరం వాడి మాట వినడం లేదు!

అవ్వ ఎంతసేపటికి మనవడు రాకపోవడంతో ఆ జ్వరంతోనే, కర్ర సాయంతో వాణ్ణి వెతు క్కుంటూ వచ్చి, ఆ పరిస్థితుల్లో వున్న మనవణ్ణి చూసి బోరుమంది!

# అనుబంధం

"ఏందయ్యా! ఏం జరిగింది?" అంది వాణ్ణి ఒళ్ళోకి తీసుకుంటూ

"ఏం జరిగిందా? వీడికి పొగరెక్కింది! వాడి దరిద్రపు అయిసు కొన్లేదని నానా మాటలూ అన్నాడు

నా సంగతెర్లుసుగా? తల్చుకుంటే ఊరి పొలిమేరలు దాటించెయ్యకలను! జాగత్త!" ఉరిమినట్టు అన్నాడు ఆనందరావు

అవ్వని చూశాక అతని ఆవేశం మరింత పెరిగింది!

"ఏటి నానా! అలా అన్నావా?" మెల్లగా వాడి తల నిమురుతూ అంది అవ్వ

లేదన్నట్టు తల అడ్డంగా ఊపాడు కోటిగాడు

అవ్వని చూశాక వాడి దుఃఖం రెట్టింపయింది

## మిగిలేది

స్పష్టాస్పష్టతల నడుమ
హోయలు పోయే కవిత్వం
సూటిగా మోటుగా
మొనదేలగానే
మిగిలేది ఘాటు
తప్పకునేది ఆవేశం!

— నిఖిల్

"అయితే నేనబద్ధం ఆడానంటావా? దార్నిపోయే తద్దినాన్ని కోరి తెచ్చుకున్నా నంటావా?" అరిచాడు ఆనందరావు

"లేదు బాబూ! ఏదో సిన్నోడు? తమరు కోపం సేసుకోకండి బాబూ!" సర్ది చెప్పింది తగూలంటే భయపడే అవ్వ

"అవునే! సిన్నోడే! మరి సిన్నోడైతే ఆ పెద్ద మాటెందుకే? ఇదిగో! ఇదే చెప్తున్నాను! ఈ పరిసరాల్లోకి ఇంకెప్పుడైనా వచ్చారో"

"అహఁ! ఇంకెప్పుడు రాం బాబూ!" అతని మాట పూర్తి కాకుండానే కంగారుగా అనేసింది అవ్వ

"ఇలా చెప్పడం ఎన్నోసారి! అలగా జన్మా! అలగా బుద్దులు!" ఓ సారి ఏవగింపుగా అవ్వా మనవళ్ళకేసిచూసి కొడుకుతో సహా లోపలికెళ్ళి ధఢాల్న తలుపు మూసు కున్నాడు ఆనందరావు

అతను వెళ్ళగానే—

"నాన్నా! కోటే!!" పొంగి వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ అంది అవ్వ వాడి తల మీది గాయం ఆమెకి కంగారు పెడుతోంది!

"ఏమిటి?" అన్నట్టు చూశాడు కోటిగాడు

"ఇంటికెళ్దాం పద!" గాయాన్ని కొంగుతో తుడుస్తూ అంది

"కా నీ పాలైస్!" దుఃఖంతో వాడిగొంతు పెగల్లేదు.

అవ్వకి కూడా ఏడుపు ఆగడం లేదు కానీ —

"పోన్లే నానా! ఏం చేస్తాం! అయినా నువ్వలా అనకూడదయ్యా! ఆళ్ల పెద్దోల్లు! ఆరు కోపం చేసేత్తే మనం బుగ్గయి పోవూ?" అంది మెల్లగా

"అది కాదవ్వా! ఆ బాబు"

"నాకుతెల్సు నాన్నా పద! ఇంకెప్పుడూ ఇటూరాక! ఒచ్చినా ఈ ఇంటి కాడికి అసలు రామాక లెగు! ! మెల్లగా ఇంటికెల్దాం! మీ అయ్యగారితో నే సెప్పుకుంటాను! పాలైసుల ఇసయం!"

వాడి కళ్ల నిండా నీళ్లు!

వాడి వళ్ళంతా దుమ్ము!

వాడి బట్టలంతా రక్తపు మరకలు!

మెల్లగా ఓపిక చేసుకుని లేవబోయాడు

"కూర్చో! ఇది తిను!" మెల్లిగా ఓ ఆకులో టిఫిన్ అందించింది శకుంతల

"వద్దు!" అన్నట్టు తల తిప్పాడు కోటిగాడు

వాడిలోని అభిమానానికి విస్తుపోయింది శకుంతల బలవంతంగా వాడిచేత తినిపించింది

"నీ పేరు రాజవ్వ కదూ?" అంది హఠాత్తుగా

తుళ్ళిపడ్డ అవ్వ "అవునమ్మా!" అనేసింది

ఓసారి కోటిగాడికేసి చూసి దీర్ఘంగా నిట్టూర్చి లోనికెళ్ళి ఓ పళ్ళెంనిండా అన్నం, కూరలు తెచ్చి —

"ఇదిగో అవ్వా! ఇది తీసికెళ్ళి తినండి! కాదనకు!" అంది మెల్లగా

"అమ్మా!" ఆశ్చర్యంగా చూసింది అవ్వ

"నీ పరిస్థితి నాకు తెలుసవ్వా! కాని నేనాయన భార్యని! ఎంతటి విషాన్నయినా దిగమింగెయ్యాలి!" అంటుంటే ఆమె కంఠం ఒణికింది

ఆమెకేసి అవ్వ జాలిగా చూసింది

"ఇంద ఈ రెండొందలు వుంచు! ఎప్పుడైనా అవసరం అయితే నన్నడగడానికి సందేహించకు! కానీ ఒక్కటి గుర్తుంచుకో! ఈ సంగతి మనిద్దరి మధ్యే వుండాలి!"

బలవంతంగా రెండు నోట్లు చేతిలో కుక్కి ఎవరో తరుముతున్నట్టు లోనికి పరిగెత్తింది శకుంతల

"ఏటి మాయమ్మా! అమ్మగోరు అంత




మనం ఏ విషయాన్నయినా వ్రాసేటప్పుడు మన వ్రాత మన అభిప్రాయానికి అనుకూలంగా వుందా? లేదా? అని ఆలోచించి, మరీ జాగ్రత్తగా వ్రాయాలి మనం సరిగా వ్రాసినా అక్షరాల మార్పిడికి అవకాశం వున్నట్లయితే, ఇతరులు అక్షరాలు మార్చి విరుద్ధాభిప్రాయాన్ని కలిగించే ప్రమాదం ఉన్నది దీనికొక ఉదాహరణ —

పసిబాలుడూ, రాజకుమారుడూ అయిన చంద్రహాసుడు అడవిలో దిక్కులేని స్థితిలో ఉండగా – ఆటవికులకు రాజైన పుళిందుడు చేరదీసి పెంచి పెద్దచేశాడు పుళిందుడు పొరుగున ఉన్న రాజునకు సామంతుడు ఆయనకు పన్ను చెల్లిస్తూ ఉంటాడు ఆ రాజుకు మగ సంతానం లేదు ఒకే ఒక కుమార్తె అతని మంత్రి దుష్టబుద్ధి పేరుకు తగినట్లే క్రూర స్వభావుడూ, స్వార్థపరుడున్నూ ఎలాగయినా తన కుమారుడికి రాజపుత్రికతో వివాహం జరిపించి, ఆ రాజ్యానికి తానే ఉత్తరాధికారి కావాలనే ఆలోచన అతనికి ఉన్నది

ఒకప్పుడు పన్ను వసూలు చెయ్యడానికి దుష్టబుద్ధే స్వయంగా పుళిందుడి వద్దకు వచ్చాడు చంద్రహాసుణ్ణి చూచి "ఈ అబ్బాయి ఎవరు? నీకు కొడుకులు లేరు గదా!" అని పుళిందుణ్ణి అడిగాడు అడవిలో దిక్కులేని స్థితిలో దొరకగా, తాను పెంచి పెద్ద చేశాననీ, గొప్ప అదృష్టజాతకుడనీ, ఆ రాజ్యానికి రాజు కాగలడనీ జ్యోతిష్కులు చెప్పారనీ అతడు తెలియజేశాడు దుష్టబుద్ధి గుండెల్లో రాయిపడింది చంద్రహాసుణ్ణి శీఘ్రంగా తుదముట్టించాలని నిశ్చయించాడు

దుష్టబుద్ధి చంద్రహాసునిపట్ల గాఢమైన ప్రేమ నటిస్తూ "నాయనా! నీవే నాకు విశ్వాసపాత్రుడవు నీకొక ఉత్తరం ఇస్తాను వెంటనే రాజధానికి వెళ్లి నా కుమారునికి ఇది ఇయ్యి ఈ లేఖను విప్పకూడదు సుమా! నీకు మేలు కలుగుతుంది" అని చెప్పి లేఖను ఇచ్చాడు చంద్రహాసుడు దాన్ని అంగీ జేబులో భద్రంగా ఉంచుకుని ఆ వూరికి వెళ్లి శ్రమ తీర్చుకోడానికి నగరం ప్రక్క ఉన్న పూలతోటలో కొంచెంసేపు విశ్రమించాడు వెంటనే నిద్ర పట్టింది

ఆ సమయంలో దుష్టబుద్ధి కుమార్తె విషయ, చెలికత్తెలతో కూడా వన విహారానికి అక్కడికి వచ్చింది ఆమె మంచి స్వభావం కలది తండ్రి బుద్ధులు ఆమెకు కిట్టవు నిద్రలో ఉన్న చంద్రహాసుని చక్కదనం ఆమెను ఆకర్షించింది ఆమె, అతని అంగీ జేబులోని లేఖను మెల్లగా తీసి, జాగ్రత్తగా తిప్పింది అది ఆమె తండ్రి కుమారునికి వ్రాసిన లేఖ అని వెంటనే గుర్తించి చదువుకొన్నది అందులో చివర, ముఖ్య విషయమంటూ "వీడు నా కమిత్రుడు వెంటనే విషమునిమ్ము" అని ఉన్నది ఆమెకు ఆశ్చర్యం కలిగింది తండ్రి చెడ్డబుద్ధికి అసహ్యపడి 'నా కమిత్రుడు' అనేచోట 'క'ను 'కు'గా మార్చి, 'విషము' అన్నచోట 'ము'కు బదులుగా 'య'ను దిద్దింది "వీడు నాకు మిత్రుడు, వెంటనే విషయనిమ్ము" అని తయారయింది ఆమె తిరిగి ఆ లేఖను అతికించి, అతని జేబులో పెట్టింది నిద్ర లేచిన చంద్రహాసుడు మంత్రి యింటికి వెళ్లి మంత్రి కుమారునికి ఆ లేఖ యిచ్చాడు అతడు, తగిన వరుడు దొరికినందుకు సంతోషించి తక్షణం పెండ్లి ఏర్పాట్లు చేసి, తన సోదరిని అతనికిచ్చి పెండ్లి చేశాడు

ఇట్లు దుష్టబుద్ధి కోరికకు విరుద్ధంగా జరిగింది అక్షరాల మార్పే గదా దీనికి కారణం!

ఈ విధంగా అక్షరాల మార్పువల్ల చెడ్డది మంచిగా మారినట్లు, 'పరుల కుపకారం చెయ్యవలెను' అనేది 'పరుల కపకారం చెయ్యవలె'నని ఉంటే విపరీతార్థం కలుగుతుంది 

డబ్బిచ్చారూ?" వింతగా చూస్తూ అన్నాడు కోటిగాడు

తృళ్ళిపడింది అవ్వ!

"నిన్నెడా పెడా కొట్టి, నీ రకతం కళ్ల జూసిన ఆ పెద్దమడిసి, నిన్ను కన్న నీ బాబేరా! పాసిపని సేసే మీ యమ్మని మోసంసేసి నీ జన్మకి కారనం అయి, గన్నట్టేట్లొ ముంచడవే గాక మనల్నీ వూర్నించి ఎల్లగొట్టడానికి సూశాడ్రా ఈ దరమపెబువు! ఇటేపు రానని పెమాణం సేయించుకున్నాకగానీ వూరుకోనేదురా!

అందుకే ఆటాత్తుగా నువ్వు కనిపించేసరికి తన పాపం గుర్తొచ్చి శివాలాడాడు! పిచ్చోడా! మంచి బట్లేస్తే నువ్వూ ఆ రమేష్‌బాబులా వుంటావని అందరికీ తెలుసురా! ఈ కదంతా తెలిసిన ఆ దరమతల్లి జాలిపడిందిరా! పోలికబట్టి నిన్నూ, పేర్నట్టి నన్నూ గుర్తుట్టి జాలడి ఇచ్చిందిరా నానా!" అని చెప్పాలనుకుంది కానీ చెప్పలేదు! అలాచెప్తే ఆ పసివాడి మనసులో ఒకలాంటి ప్రేమో, లేక ఆశో, అదీగాక తల్లిని మోసం చేసినందుకు కక్షో బయల్దేరుతుందనీ, అది అనేక అనర్థాలకి దారితీస్తుందనీ ఆమెకి తెలుసు అందుకే –

"ఆయమ్మది జాలిగుండె నానా! మా దొడ్డ ఇల్లాలని ఇన్నాను! ఇప్పుడు సూత్తన్నాను!" రెండు చేతులు జోడించి మేడకేసి చూస్తూ అంది అవ్వ

కోటిగాడు కూడా ఆరాధనగా నమస్కరించి లేచాడు

మనవణ్ణి పొదివి పట్టుకుని తూలుతూ వెళ్ళిపోతున్న అవ్వని పై అంతస్తులోంచి చూస్తున్న శకుంతల కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి!

ఏదో సినిమాలోని సంఘటన గుర్తొచ్చిందామెకి

తండ్రీ కొడుకులని తెలియకుండానే ఒకర్ని చూసి ఒకరు తన్మయత్వంగా చూసుకుంటారు అదే "రక్తసంబంధం" అని తేల్చాడు కథకుడు!

కానీ అది సినిమా!

ఇది? నిజజీవితం!

సిరిసంపదలముందు, పేరుప్రఖ్యాతుల ముందు, ఈ బంధాలు తారుమారవుతాయి!

సమయానుకూలంగా మారుతూంటాయ్!

మరోసారి భారంగా నిట్టూర్చింది శకుంతల

"అనుబంధం ఆత్మీయత అంతా ఒక బూటకం ఆత్మతృప్తికై మనుషులు ఆడుకునే నాటకం వింత నాటకం"

పాట ఎక్కణ్ణించో విషాదంగా వినిపిస్తోంది! 




**టి. వి. — ఒరిస్సా**

నా వయస్సు 20 సంవత్సరములు నేను మోటర్‌సైకిల్‌మీద వెడితే కంటినుండి నీరు కారుతుంది ఈ నీరు కంటి లోపమువల్ల వస్తుందా ? ఎందుకు వస్తుంది ? రాకుండా వుండాలంటే ఏమి చెయ్యాలి ?

ఇలా అందరికీ వస్తుంది శారీరక లోపం ఏమీలేదు వేగంగా గాలి, దుమ్ము తగలటంవల్ల ఇలా జరుగుతుంది కళ్ళజోడు వాడటం లేక హెల్మెట్‌తోబాటుగా వైసర్ ఉన్న సాధనం వాడితే కళ్ళలో నీళ్ళు రావు

**ఎస్. ఆర్. ఎన్. — నందిగామ**

నాకు ఎడమచేతి మధ్య వ్రేలిపై స్పర్శ జ్ఞానము లేని మచ్చ ఏర్పడినది ఇది లెప్రసి అని నేను భయపడుతున్నాను లెప్రసికి ఎన్ని రోజులు ఏ మందులు వాడాలి ?

★ లెప్రొసీ రోగానికి డాప్సోన్(డి డి ఎస్ ) మాత్రలను రోజుకి 100 మి గ్రా వంతున వరుసగా 3 సం॥ల పాటు వాడవలసి ఉంటుంది ఈ కాలగడువు పరీక్షానంతరం వైద్యుల అంచనానుబట్టి ఉంటుంది ఈ గడువు మామూలు వైపుకి మాత్రమే బార్డర్‌లైన్, లేక లెప్రొమేటస్ వైపు ఉన్నప్పుడు ఈ గడువు ఇంకా అధికం అవుతుంది ప్రస్తుతం రీఫామైసిన్, లాంపిరిన్ మందులు వాడి ఈ కాల పరిమితిని తగ్గించటానికి ప్రయత్నాలు చేస్తున్నారు

**డి. పి. — మోగల్లు**

నా వయస్సు 16 సంవత్సరములు, నేను చాలా లావుగా వుంటాను లావు తగ్గటానికి ఏమైనా మందులు వున్నాయా ?

★ లావు తగ్గటానికి మందులకన్నా ఆహార విషయంలో కట్టుదిట్టమైన నియమాలు పాటించటం అవసరం శరీర వ్యాయామం లేకుండా ఆహారం ఒక పద్ధతిలేకుండా అధిక క్రొవ్వు పదార్థాలు, పిండి పదార్థాలతో తీసుకొంటూ ఉంటే లాభం ఉండదు ఆకలి లేక పోయినా ఏదో ఒకటి తింటూ ఉండే వారికి శరీరం లావెక్కటం సహజం — కొందరికి మాత్రం శరీరంలోని హార్మోనుల ప్రభావంవల్ల (గ్లాండ్స్ పనితనంలోని అవకతవకలవల్ల) ఇలా ఏర్పడే అవకాశం ఉంటుంది

**జి. ఎస్. — వందలపాత**

మా తల్లిగారి వయస్సు 37 సం లు 20 సం॥ల క్రితం గుర్రపువాతం వచ్చిందట కానీ ఇప్పటికీ ఫిట్సు వస్తూ ఉంటాయి మందులు వాడగా కొన్నాళ్ళు తగ్గి మళ్ళా వస్తున్నాయి ఫిట్సు వచ్చేముందు చెవులనుంచి హోరు వచ్చి అయోమయంగా అవుతుంది ఎలా ఉంటే అలా పడిపోతారు 2 నిముషాలు మాత్రమే ఉంటుంది తర్వాత మామూలుగా లేస్తారు డైలాన్‌టిన్, గార్డినాల్, ఎప్టోయిన్ మాత్రలు వాడుతూఉన్నా అప్పుడప్పుడూ కనిపిస్తూనే ఉంది

★ దీనిని గ్రాండ్‌మాల్ ఎపిలెప్సీ అని అంటారు ఈ రోగానికి మీ తల్లిగారు వాడుతూ ఉన్న మందులు చాలా మంచివి ఈ లక్షణం తగ్గేదాకా పై మాత్రలని వైద్యుల సలహా మేరకు వాడుతూ ఉండాలి కాలగతిలో పరిస్థితిలో మార్పు వస్తుంది

**పి. వి. ఎల్. — విశాఖపట్నం**

నాకు నెలా పదిహేను రోజులుగా కుడికాలు పాదం వాచి ఉన్నది డాక్టర్ సలహాపై 21 రోజుల పాటు హెట్రజాన్ వాడేను కాని వాపు తగ్గలేదు ఉదయం లేవగానే తగ్గుతుంది పని చేస్తున్నకొద్దీ ఎక్కువైపోతుంది

★ ఈ వాపు ఫైలేరియావల్ల వచ్చింది కాదు కాబట్టి హెట్రజాన్ మాత్రలకి తగ్గలేదు

మీరు నెత్తురులోని ఎర్రకణాల సంఖ్య, హీమోగ్లోబిన్ ప్రమాణం, మల పరీక్ష చేయించుకోవాలి తర్వాత కార్డియాలజిస్టులవద్ద మీ హృదయంలో— ఏదైనా రోగాలు ఉన్నదీ లేనిదీ పరీక్షింప చేసుకోవటం మంచిది ఈ పరీక్షల ఫలితాల ననుసరించి చికిత్సా విధానం తీర్మానింపబడవలసి ఉంటుంది

**ఎస్. ఎమ్. కె. — రాజమండ్రి**

నాకు మూడు సంవత్సరముల నుండి నా అరికాళ్ళలో 'ఆని'కాయలు వున్నాయి కుడి కాలికి 4, ఎడమకాలులో 2 వున్నవి అవి రోజు రోజుకి నెప్పి ఎక్కువ అవుతున్నది దీని కోసం ఆయుర్వేదం మందులు వాడాను ఏమీ తగ్గలేదు ?

★ ఆనెలను సమూలంగా శస్త్రచికిత్సద్వారా తీసివేయటం ఉత్తమమైన మార్గం కాళ్ళకి మెత్తని పాదరక్షలు వాడటం వల్ల నెప్పి తాత్కాలికంగా తగ్గించుకోవచ్చును ★

---

వాళ్ళంతా ఒకటే వేడిగాను,
చలిగాను వుంది శేఖర్!!



# నీరు వేడిచెయ్యవలసిన అవసరం లేదు,
# సీసాని మరగబెట్టవలసిన శ్రమ లేదు,
# వేడిగా చల్లగా ఉండేమోననే బాదరబందీ లేదు!



ప్రకృతి యుగయుగాల నుంచి
సహజమైన స్వాభావికమైన తీరులో
అప్పుడే పుట్టిన పాప యొక్క
పోషణ నెలా చేస్తూ పోతోందో మరి!

ప్రకృతి వేలకి వేల లక్షల ఏళ్ళబట్టి
ప్రయోగాల వెంట ప్రయోగాలు చేస్తూ
చేస్తూ చివరికి శరీర నిర్మాణంకోసం
ప్రోటీన్లు, శక్తినిచ్చే కార్బోహైడ్రేట్లూ
కొవ్వు పదార్థాలూ ఆరోగ్యాన్ని కాపాడే
విటమిన్లూ వీటి యొక్క సరియైన
సంతులితమైన దాన్ని తయారుచేసింది
అందుకే తల్లిపాలు పాపకొక ఆదర్శ
ఆహారం అయింది

**కలుషితం అయ్యే ప్రమాదం లేదు**

మీ పాప స్తన్యపానం చేసేటప్పుడు, అవి ఏ రకం గానూ కలుషితం అయ్యే ప్రమాదమిక ఉండదు ఎందుకంటే దాన్లో కలుషితమవడం గాని సీసాని శుభ్రం చేయవలసి రావడంగాని ఉష్ణోగ్రతని చూడవలసి రావడం గాని చేసే ప్రశ్నే లేదు గనక తల్లి పాలంటారా అవి అమృత తుల్యమైనవి!

అంతేగాకుండా ప్రకృతి దాన్లో రోగ నిరోధక ద్రవ్యాలను కూడా ప్రసాదించింది దాంతో మీ పాప ఆమాశయం పేగుల్లోని వ్యాధులు, యితర వ్యాధుల మంచి రక్షణ కలుగుతుంది మరి తల్లి పాలలో యింకా ఎన్నెన్నో ఉన్నాయి—స్కర్వీ వ్యాధిని నిరోధించే విటమిన్ సీ ఉంది

**ప్రపంచమంతా ప్రచలితం**

ఇప్పుడు రోజుకి రోజూ ప్రపంచమంతటా ఎక్కువ మంది తల్లులు అంటే పశ్చిమ దేశాల్లో సహితం, తల్లులు తమ పాలే యివ్వడం మొదలెట్టారు ఎందుకంటే, తల్లి పాలలోని పోషణ తత్వాల మహత్తర లక్షణాల్ని మళ్ళా వాళ్ళు అవగాహన చేసుకోవడం మొదలెట్టారు

**తప్పకపోతే**

మరి మీరేగనక యిక ఏ కారణం
వల్లనైనా తప్పకపోతే, మీ పాపకు మీ
పాలు ఇవ్వలేకపోతే—అంటే మీ
ఆరోగ్యం సరిగా లేకనో లేదా మీలో
సరిపడినన్ని పాలు పడకో అలా
జరిగినప్పుడేం చెయ్యాలి మీరు!
అటువంటి సందర్భంలో మీరు ఎంతో
ఆలోచించిన మీదట ఎటువంటి ఎటువంటి
ఆహారం యివ్వాలంటే, ఆ యిచ్చేది
తల్లి పాల తర్వాత అన్నింటికన్న
ఉత్తమమైనదిగా ఎంచుకునేదాన్ని

**స్ప్రే డ్రయిడ్ అమూల్ స్ప్రే**

అమూల్‌స్ప్రే, పుష్టినిచ్చే దృష్టితో చూస్తే మహత్తరంగా సంతులితమైన ఆహారం ఎందుకంటే దీన్లో చాలా ఎక్కువైన తీరులో ప్రోటీన్లు దాంతోబాటే, తేలిగ్గా అరగగలిగే కార్బోహైడ్రేట్లు సరియైన సంతులిత రూపంలో అత్యావశ్యమైన విటమిన్లూ, ఖనిజ పదార్థాలు ఉన్నాయి ఇది అంతకు ముందే మరగబెట్టిన నీటిలో టక్కున కరిగిపోతుంది మొదటిగానే పేస్టులా తయారు చేయవలసిన అవసరం ఉండదు

**పొదుపు**

అమూల్‌స్ప్రే డబ్బాలలో దొరికే శిశుఆహారాన్నిటికన్న పొదుపైనది ఎందుకంటే యిది ఆధునికమైన పాల సంఘం యొక్క ఉత్పాదన—శ్వేత విప్లవం తీసుకురావడంలో అందరికన్న ముందడుగు వేసారు

**జాగ్రత్త పడటం**

పాప ఆహారానికి ఉపయోగించే అన్ని వస్తువుల్నీ సీసానీ, ఎప్పుడూ ఆరోగ్యరీత్యా బాగా శుభ్రంగా కడిగి నీటిలో మరగబెట్టాలి పాప ఆహారాన్ని తయారు చేయడానికి కూడా మరిగిన నీటినే వాడండి పాప సరియైన పోషణకోసం, డబ్బాపైన యివ్వబడిన అమూల్‌స్ప్రే మోతాదుల ప్రకారమే ఖచ్చితంగా పాప ఆహారాన్ని తయారు చెయ్యండి

**ఉచితం! అమూల్ బేబీ పుస్తకంలో**
ఉపయోగకరమైన విషయాలు యీ అధ్యాయాల్లో ఉన్నాయి అవి గర్భధారణ, ప్రసవానికి ముందర జాగ్రత్త ప్రసవము, తల్లిపాలు, ఇతర ఆహారములు, మిశ్రమ ఆహారమును అలవాటు చేయుట, పిల్లవాని దినచర్య పిల్లవాని అభివృద్ధి జబ్బులను అరికట్టుట, ప్రథమ చికిత్స, సాధారణ రోగములు జబ్బుతోనున్న పిల్లవాని సంరక్షణ, జ్ఞాపకముంచుకోవలసిన విషయములు ఈ పుస్తకం తెలుగు, ఇంగ్లీషు, హిందీ, తమిళం, మలయాళం, మరాఠీ, గుజరాతీ బెంగాలీ భాషల్లో దొరుకుతుంది దానికోసం పోస్టు బాక్సు 10124, బొంబాయి 400 001 అడ్రసుకు మీ పేరూ, పూర్తి అడ్రసు యిస్తూ రూ 1 25 స్టాంపుల్ని జతపర్చండి




# ఆమూల్‌స్ప్రే

**తల్లిపాల తరవాతనే ఇది**

అమ్మకం చేయించువారు
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్
లిమిటెడ్, పోస్ట్ బాక్స్ 10, ఆనంద్ 388 001, గుజరాత్



ASP/AS TEL6/83




శ్రీమతి జి. భవానీకృష్ణమూర్తి సీరియల్

# అనురాగ తరంగాలు

(గత సంచిక తరువాయి)

ఇక్కడ అందరూ తన లాంటి శాపగ్రస్తులే. పాపమే రోగం ఆ రోగమే శాపం ఏ జన్మలోనో తెలిసో, తెలియకో ఏదో పాపం చేసి ఉంటుంది తను అందుకే ఈ విధంగా అనుభవిస్తోందప్పుడు ఎంతోమందిని ఆదుకుని ఆశ్రయం కల్పించాలని ఆరాటపడ్డ తను ఇక్కడ ఇలా డాక్టర్ల దయాధర్మంమీద ఆధారపడుతూ కాలక్షేపం చెయ్యాల్సి వస్తోంది వెనకవైపు కొద్దిదూరంలో ఉన్న జనరల్ వార్డులోని దీర్ఘరోగులు గుర్తొచ్చి ఆమె హృదయం జాలితో నిండిపోయింది డాక్టర్ల, నర్సుల దయాధర్మం మీద ఆధారపడి చావలేక బ్రతుకుతూ, అలా బ్రతకలేక చావాలనుకుంటూ బ్రతికే నిర్భాగ్యులు వాళ్లు ఉద్యోగ నిర్వహణలో తప్పనిసరి కనుకగానీ, ఎప్పుడూ ఇలాంటి రోగుల మధ్య కాలం గడపాలంటే ఆ డాక్టర్లకీ విసుగే ఇలా అన్నివైపుల నుంచీ ఆలోచిస్తూ ఇక్కడి తన జీవితాన్ని నవలా రూపంలోకి మలచడానికి ఉబలాట పడసాగింది ఆమె మనసు

మధుర భావాలను నింపుకుంటూ చివరికి ఈ విధంగా సాగిన తన ఊహలకి తనే నవ్వుకుని ఇక ఆలోచించే ఓపిక లేక బలవంతంగా కళ్లు మూసుకుని నిద్రకి ఉపక్రమించింది లీల కలత నిదురలోనే ఆ రాత్రి గడిపింది ఐదు గంటలకే లేచి తన కాలకృత్యాలు తీర్చుకుని, చక్కగా తయారై బయట వరండాలో కుర్చీ వేసుకుని వీక్లీ చదువుతూ కూర్చుంది మరీ నీరసంగా ఉంటే తప్ప మన్నుతిన్న పాములా కూర్చోవడం నచ్చదు లీలకి చక్కగా డ్రెస్ చేసుకుని నీట్‌గా ఉండడం అలవాటు ఇక్కడున్నా అంతే పక్క రూములోని పేషెంటు బెంగాలీ ఆవిడ నిద్రలేచి బయటికి రాగానే లీలని విష్‌చేసి "సిస్టర్! ఈ రోజు మీ ముఖంలో ఫ్రెష్‌నెస్, ఉత్సాహం కనిపిస్తున్నాయి వాట్ ద రీజన్ ?" అంది

"అదేం లేదు మామూలుగానే ఉన్నానుగా "

"ఉహు ! కాదు సరేలెండి నేను వెళ్ళి కాలకృత్యాలు తీర్చుకుని వస్తాను మళ్ళీ డాక్టరు గారు విజిట్‌కి వస్తారు" అనుకుంటూ వెళ్ళిపోయింది

"నాకు తెలియకుండానే బయటపడిపోతున్నానా ?" అనుకుంది లీల అంతక్రితం రోజు జరిగిన సంఘటనలన్నీ మరోసారి జ్ఞాపకం చేసుకుంటూ కూర్చుంది

డాక్టరుగారు రాగానే ఒక్కొక్కరే వెళ్ళి చూపించుకుంటూంటే కేస్‌షీట్ తీసికెళ్ళి తనూ పరీక్ష చేయించుకుంది వ్యాధి చాలావరకు తగ్గిపోయిందని ఒక నెలరోజులల్లో ఇంటికి వెళ్ళిపోవచ్చని చెప్తూ బ్లడ్, కళ్ళి, పరీక్ష చేయించుకోమని, రిపోర్ట్సు తీసుకొచ్చి చూపించమని అన్నారు వెంటనే వెళ్ళి పరీక్ష చేయించుకుని రిపోర్ట్సు తీసుకొచ్చి ఆయనకి చూపించింది

"వెరీగుడ్ ఇంప్రువ్‌మెంట్, నిజంగా నెల రోజులలో పూర్తిగా క్యూర్ అయిపోతుందమ్మా "

"థ్యాంక్యూ వెరీమచ్ డాక్టర్ ప్రిస్క్రిప్షన్ అదే కంటిన్యూ చేయమంటారా?" అడిగింది

"నో, నో! ఎక్కువగా ఉన్నప్పుడు వాడిన మందులే వ్యాధి తగ్గుముఖం పట్టాక వాడితే ఎలా ?" అంటూ వేరే మందులు రాసిచ్చారు

మరోసారి కృతజ్ఞతలు తెలియజేసి తన రూమ్‌కి వచ్చింది

బెంగాలీ ఆమె కూడా పరీక్ష చేయించుకుని, వచ్చి "సిస్టర్! మరో వారం రోజుల్లో నన్ను డిశ్చార్జి చేస్తారట" అంటూ మరో కుర్చీలో కూర్చుంది ఆవిడ

"కంగ్రాట్యులేషన్స్ నేనింకా నెల రోజులు ఉండాలట వెళ్ళేరోజు దగ్గర అవుతున్నకొద్దీ ఆ రోజు ఎంత తొందరగా వస్తుందా అని ఆరాటంగా అనిపిస్తుంది కదూ?"

"అవును సిస్టర్ మీ రచనలు నేను చదవకపోయినా మీలాంటి వెల్‌నోటెడ్ తెలుగు రైటర్‌తో పరిచయ భాగ్యం కలిగినందుకు చాలా సంతోషంగా ఉంది" అంది బెంగాలీ ఆవిడ

"నాకూ అలాగే ఉంది సిస్టర్ మీతో సరదాగా కబుర్లు చెప్తూ కాలక్షేపం చేస్తుంటే రెండు నెలలు ఇట్టే గడిచిపోయాయి" అంది లీల

"మీరు సంపూర్ణ ఆరోగ్యవంతులై ఇంకా ఇంకా ఎన్నో మంచి రచనలు చెయ్యాలని నా కోరిక" మనస్ఫూర్తిగా అంది

"థ్యాంక్యూ వెరీమచ్ సిస్టర్" ఆవిడ అభిమానానికి లీల కళ్ళు చెమర్చాయి

"నేను ఇంటికి వెళ్ళిపోయినా మిమ్మల్ని చూడడానికి అప్పుడప్పుడు వస్తూనే ఉంటాను మీ ఊరు వెళ్ళాక మరచిపోకుండా లెటర్స్ రాస్తుండండి "

"తప్పకుండా రాస్తుంటాను మీలాంటి అభిమానుల్ని పోగొట్టుకునేంత తెలివితక్కువ దాన్ని కాదు" అంది లీల

'ఇదేమిటి ఇప్పుడే వెళ్ళిపోతున్నట్లు ఇలా అప్పగింతలు అప్పగించేసుకుంటున్నాము' అని నవ్వుకున్నారిద్దరూ

ఆ రోజు సాయంకాలం జయరామ్ రాగానే చెప్పింది

"అవునట ఇప్పుడు నేను వస్తుంటే నా వెనుక డాక్టరుగారు వస్తుంటే ఆగి పలకరించి అడిగాను నెలరోజుల్లో ఇంటికెళ్ళిపోవచ్చని, ఆ తరువాత వారానికొకసారి–అంటే జనరల్ చెకప్ కోసం వస్తే మంచిదని అన్నారు సరేనన్నాను "

"అంటే ఇంకో నెల రోజులుండాలా ఈ ఊళ్ళో ?" చిన్న పిల్లలా ముఖం పెట్టింది

**జరిగిన కథ – 9 :** ఓ అనాథశరణాలయాన్ని నడపాలని నిశ్చయించుకొంటుంది లీల అనుకున్న ప్రకారంగానే అనాథ శరణాలయాన్ని నిర్మించి ఎంతోమంది అభాగినులను ఆదుకొని వారికి జీవనోపాధి చూపెడుతుంది లీల లీలని భయంకరమైన వ్యాధి ఆవరిస్తుంది రఘుకి ఇచ్చిన మాటప్రకారం హైదరాబాద్ వెళ్లి ట్రీట్‌మెంట్ తీసుకోడానికి ఒప్పుకొంటుంది కానీ ఇంట్లో తల్లిదండ్రులకు, రేణుకకు తను చదువుకోడానికి వెళ్తున్నట్లు అబద్ధమాడి, వాళ్ల కోపతాపాలకి గురౌతుంది కానీ రఘు వాళ్లని ఒప్పిస్తాడు లీల, రఘు రైలులో హైదరాబాద్ వెళుతుండగా దారిలో కలుస్తాడు జయరామ్ అతనికి హైదరాబాద్ ట్రాన్స్‌ఫర్ అవుతుంది లీలని టి బి ఆస్పత్రిలో చేర్చి, కావల్సిన సౌకర్యాలన్నీ కల్పించి వూరు వెళ్లిపోతాడు రఘు జయరామ్ లీలతో వీలున్నప్పుడల్లా వచ్చి కాలక్షేపం చేస్తుంటాడు లీలకీ రోగం తగ్గిపోయాక పెళ్లి చేసుకోవాలని వారు నిర్ణయించుకొంటారు

''ఊ !'' మూతి బిగించి తల ఊపాడు

అతన్ని అనుకరిస్తూ వెక్కిరించింది

నవ్వేశాడు జయరావ్

లీల ఉడుక్కుంటే తను తెచ్చిన క్రీమ్ బిస్కెట్ల పాకెట్ విప్పి ''ఇదిగో తిను ఇలాంటి బలమైన తిండి తింటే తొందరగా నయమై పోతుంది ఇంకా తొందరగా మీ పుచ్చపల్లి వెళ్ళి పోవచ్చు'' అన్నాడు

''పెద్ద! మీ పుచ్చపల్లిట ఆ ఊరితో నీకేం సంబంధంలేనట్లు ?'' కోపంగా అంది

''లేకపోవడం ఏమిటి ? కాబోయే మా అత్తగారి ఊరు ఏం ? ఇంకా నీకేమైనా అనుమానంగా ఉందా ?'' సందేహంగా చూశాడు

తన కోపం మాట మరచిపోయి నవ్వేసింది లీల మరో అరగంట కూర్చుని వెళ్ళిపోయాడు జయరావ్

* * *

విశ్వనాథంగారు పొలంలో ఉన్నారు ప్రభావతమ్మ వంట ఇంట్లో వంటపని ముగించి ఎక్కడివక్కడ సర్దుతోంది బాబుకి అవి ఇవీ చూపించి కబుర్లతో మరిపిస్తూ అన్నం తినిపిస్తోంది రేణుక పూట పూటా బాబుచేత అన్నం తినిపించడం పెద్ద గండమే రేణుకకి ఒక పట్టాన తిండి తినడు ''వేళకి సరి అయిన తిండిలేకపోతే పిల్లలు సక్రమంగా పెరగరు ఎలాగో అలా మురిపించి తినిపించు'' అంటూ మందలిస్తుంటాడు రఘు, రేణు విసుక్కుంటూంటే

పెరిగిన గడ్డం, మాసిన గుడ్డలతో లోపలికి వస్తున్న వెంకటేశాన్ని చూసి గతుక్కుమంది రేణుక

''అదేమిటలా చూస్తున్నావు రేణూ నన్ను మరచిపోయావా ?'' రెట్టించి అడిగేసరికి ''అబ్బే! నిన్ను మరచిపోవడం ఏమిటి ? రా, కూర్చో అలా అయిపోయావేమిటి ?'' అడిగింది

ఆ రోజు లీల చేత చివాట్లు తిన్నాక వెళ్ళిన వాడు ఈనాడే మళ్ళీ కన్పించాడు

''భగ్నప్రేమికులు ఇంకెలా ఉంటారు రేణూ !''

''అయితే, నువ్వింకా పెళ్ళి చేసుకోలేదా ?''

''ఎలా చేసుకుంటాననుకున్నావు ? నేను కోరుకున్నది పరాయి సొత్తు అయిపోతోందని తెలిసినప్పుడే పెళ్ళి అనే పదాన్ని సమాధి చేసేశాను ''

''సరే! పద లేచివెళ్ళి స్నానం చేసిరా ఈలోగా పొలంనుంచి పెదనాన్నగారు, ఆస్పత్రి నుంచి ఆయన వచ్చేస్తారు అందరూ కలిసి భోజనాలు చెయ్యొచ్చు ''

''అలాగేలే అత్తయ్య, చంద్రం ఇక్కడ ఉండడం లేదటకదా ?''

''అవును చంద్రానికి గుంటూర్లో ఉద్యోగం వచ్చింది అమ్మ కూడా వాడి దగ్గరే



వుంటోంది, చెల్లికి పెళ్ళయింది అత్తవారింట్లోనే ఉంది అప్పుడప్పుడు వచ్చి పోతూంటారు''

''రేణూ! నన్ను తిరస్కరించి రఘుని చేసుకుంటానంటే పోనీలే ఎవరిని చేసుకున్నా నువ్వు సుఖపడితే చాలనుకున్నానుగానీ, చివరికి నీ జీవితం ఇలా అవుతుందనుకోలేదు''

''ఇప్పుడు నా జీవితానికి వచ్చిన లోటు ఏమిటి? ప్రేమగా చూసే భర్త, ముద్దులు మూటగట్టే చిన్నారి బాబు, కన్న బిడ్డలా ఆదరించే పెద్దమ్మ, పెదనాన్నగార్లు ఏ స్త్రీ అయినా ఇంతకంటే ఏం కోరుకుంటుంది?''

''అయ్యో, పిచ్చి రేణూ! నువ్వింత అమాయకురాలివి కనుకనే రఘు నిన్నలా మోసం చెయ్యగలుగుతున్నాడు అదే మరొకరైతేనా అతని బండారం ఇట్టే బయట పెట్టేవాళ్ళు''

''ఏమిటి నువ్వనేది?'' విషబీజం బలంగా నాటుకోవడంతో కంగారు ఎక్కువైంది రేణుకకి

''నేను అనేదేముంది? లోకం అంతా కోడై కూస్తున్నదే ముందుగా లీల ''నిన్ను ప్రేమిస్తున్నాను'' అంటే ''అయ్యో! నువ్వు నా చెల్లెల్లాంటిదానివి'' అన్నాడు

తీపి తీపి కబుర్లు చెప్పి బుట్టలో వేసుకుని నిన్నునాకు కాకుండాచేసి ఆలీలని నామీదికిఉసిగొల్పి ఎలాగైతేనేం నిన్ను పెళ్ళాడాడు వీడికోసం కాకపోతే ఇంతకాలందాకా అది పెళ్ళెందుకు చేసుకోలేదంటావు? ఇంకా ఎన్నాళ్ళు ఎదురుచూడను అని నిద్రాహారాలు మానేసి భీష్మించుకుని కూర్చుంది రీసెర్చ్ వంకతో హైదరాబాదులో కాపురం పెట్టాడు దానితో ఈ మూడు నెలల నుంచీ ప్రతీ పదిహేను రోజులకీ వెళ్ళి వస్తూనే ఉన్నాడు కదా నిన్ను ఒక్కసారైనా ఎందుకు తీసికెళ్ళలేదంటావు? అహా! ఆలోచించు నీకే అర్థం అవుతుంది నువ్వు వారికి అడ్డు అనే కదా?'' పొయ్యాల్సిన ఆజ్యం అంతా పోసేసి ఆగాడు వెంకటేశం

తల్లిదండ్రులు వద్దని బ్రతిమాలుతుంటే

# అనురాగ తరంగాలు

రఘు లీలనే సమర్థించి వారికి నచ్చచెప్పడం, తను కూడా వస్తానంటే ప్రతీసారీ ఏదో సర్ది చెప్పి ఆపుచెయ్యడం, అగ్గగ్గలాడుతూ దాని నిద్రాహారాల విషయంలో శ్రద్ధచూపడం అన్నీ కళ్ళ ముందు మెదిలి విషసర్పాల్లా బుసగొట్టసాగాయి

''నంగనాచి! స్నేహితురాలివి అంటూనే ఎంత నాటకం ఆడింది'' కసిగా పళ్ళు కొరుక్కుంది రేణుక కోపంతో ఎర్రబడింది ఆమె ముఖం అటో, ఇటో తేల్చిపారెయ్యాలన్న పట్టుదల ఆ కళ్ళల్లో స్పష్టమవుతోంది ఎంతటి ప్రాణ స్నేహితురాలైనా స్నేహితురాలిగా ఉన్నంతసేపే ఆ విలువ నా మొగుణ్ణి వలలో వేసుకుని నీ సవతిని అంటే ఊరుకుంటానను కుంటోంది కాబోలు'' విశ్వనాథంగారు పొలం నుంచి రావడంతో ఆ ఆలోచనల్ని, కోపాన్ని తాత్కాలికంగా పక్కకి నెట్టింది రేణుక

అతన్ని చూసి గుర్తు పట్టలేకపోయినా, రేణుక చెప్పాక గుర్తుపట్టి ''అయ్యో! అదేమిట్రా, ఇలా తయారయ్యావు? వెళ్ళి స్నానం చేసిరా'' ఆప్యాయంగా వెంకటేశం భుజం తట్టారు

రేణు ఇచ్చిన టవల్ అందుకుని బాత్ రూములోకి వెళ్ళి స్నానంచేసి వచ్చేసరికి రఘు వచ్చాడు

వెంకటేశాన్ని చూడగానే టవల్‌తో ఉన్నాడని అయినా ఆలోచించకుండా గట్టిగా కౌగలించుకుని ''అరేయ్! ఇన్నాళ్ళు ఎక్కడెక్కడ తిరిగావురా, ఫూల్?'' ప్రేమగా పలకరించాడు

''సత్రం భోజనం, మఠం నిద్ర''

''ఈడియట్! ఉన్న ఉద్యోగం వదులుకుని నువ్వు చేసిన నిర్వాకం అదా? రేణూ! నా లుంగీ బనీను తీసుకొచ్చి ఇయ్యి వీడికి'' అంటూ తను కాళ్ళు కడుక్కురావడానికి పెరట్లోకి వెళ్ళాడు రఘు

కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు చేశాక

## మధుమేహం రోగులకి వరం!

చక్కెర రోగులకు వరప్రసాద మన దగిన ఒక చిన్న ఎల్రక్టానిక్ పరికరాన్ని పశ్చిమ జర్మనీ డాక్టరు మాన్ ఫ్రెడ్ కీపల్ తయారు చేశారు ఈ పరికరాన్ని చర్మం కింద అమరుస్తారు ఇది బ్లడ్ షుగర్ పరిమాణాన్ని ఎప్పటికప్పుడు తెలియ చేస్తుంది దీనికి తగినట్లుగా రోగి ఇన్సులిన్ని, ఆహారాన్ని తీసుకోవచ్చు ఈ పరికరాన్ని ఒక వైద్య సంచలనంగా భావిస్తున్నారు చక్కెర వ్యాధికి సరైన సమయంలో చికిత్స లేకపోతే అంధత్వం రావటానికి, కాళ్ళు చచ్చుబడి పోవటానికి అవకాశం ఉన్నది ఈ పరికరంతో పాటు ఇన్సులిన్ మోతాదును తెలిపే మరో చిన్న పరికరాన్ని తయారు చేయాలని కూడా డాక్టరు మాన్ ఫ్రెడ్ ఆశిస్తున్నారు

''రెస్టు తీసుకోరా'' అని వెంకటేశానికి చెప్పి తను ఆస్పత్రికి వెళ్ళిపోయాడు రఘు తను వచ్చిన పని అయింది కనుక, రేణుకతో మరో నాలుగు కల్లబొల్లి కబుర్లు చెప్పి ఒక వంద రూపాయలు తీసుకుని చల్లగా జారుకున్నాడు వెంకటేశం

* * *

ఆస్పత్రి నుంచి ఇంటికి వచ్చిన రఘు రేణు ఎప్పటిలా ఉత్సాహంగా లేకపోవడం చూసి ''రేణూ! ఒంట్లో బాగాలేదా?'' ఆదుర్దాగా అడిగాడు

''విశేషంగా ఉంది?'' అతని చేతిలోని కోటు అందుకుని గిర్రున వెనుతిరిగే సరికి ఆమె జడ టప్పున అతని ముఖాన్ని ముద్దాడింది

''అబ్బో! రాణీగారు సత్యభామావతారం దాల్చారు! కారణం ఏమిటో?'' ఆ జడ పట్టి

దగ్గరకు లాక్కుని తన ముక్కుతో ఆమె చెక్కిలి నొక్కాడు

అతని చేతుల్ని విదిలించుకుని విసురుగా వెళ్లి కోటుని హేంగర్‌కి తగిలించి బయటికి వెళ్లబోతూంటే "అంటేని వడ్డించమను వచ్చేస్తున్నా, ఆనక తీరిగ్గా నీ అలక తీరుస్తాను" అన్నాడు

భోజనం చేసి వచ్చాక "అదేమిటి వెంకటేశం అప్పుడే వెళ్లిపోయాడు, వుండమని చెప్పలేదా ?" బాబుని నిద్రపుచ్చుతున్న రేణుక పక్కన కూర్చున్నాడు

"ఉండాలనుకుంటే అతనే ఉంటాడు నేను బ్రతిమాలేదేమిటి ?"

"అబ్బ ! స్పీడు తగ్గించవోయ్ అసలు ఏమిటయింది ఈరోజు ఇలా చిటపటలాడు తున్నావు" ఆమె భుజాల చుట్టూ చేతులు వేసి దగ్గరకు తీసుకోబోతూంటే "ఈరోజు కాదు, చాలా రోజుల క్రితమే నా జీవితానికి గ్రహణం పట్టడం మొదలైంది అది నా జీవితాన్ని పూర్తిగా కబళించకముందు నన్ను నేను ఎలా కాపాడుకోవాలా అని ఆలోచిస్తున్నాను," అతని చేతుల్ని విసురుగా తోసేసింది

ఆమె అలకకి కారణం మామూలు విషయం కాదని, ఆమె మనస్సులో ఏదో మార్పు వచ్చిందని గ్రహించాడు రఘు

"ఇప్పుడు నీ జీవితానికి వచ్చిన లోటు ఏమిటట ? చెప్పేదేదో సూటిగా చెప్పరాదూ ? డొంకతిరుగుడు మాటలెందుకు ?" అసహనంగా అన్నాడు

"మన బంగారం మంచిది కానప్పుడు ఇతరులని అని ప్రయోజనం ఏమిటి ? నా రాత రాసేరుతూంటే ఇలాంటి పెడబుద్ధులే పుడతాయి"

ఎంతో కోపం వచ్చినా నిగ్రహించుకుని "రేణూ ! నీ మనసులో ఉన్న మాట ఏమిటో చెప్పు నాలో పొరపాటు ఉంటే దిద్దుకుంటాను, ప్లీజ్ !" బ్రతిమాలాడు, తెగేదాకా లాగడం మంచిదికాదన్న ఉద్దేశ్యంతో

"సమయం వచ్చినప్పుడు అలాగే చెప్తాను ఇప్పుడు ఉట్టుట్టి మాటలు చెప్తే మీకు సమర్థించుకోవడం బాగా తెలుసు"

"సరే నీ ఇష్టం వచ్చినప్పుడు చెప్పుగానీ, అంతవరకూ ఇలా మూతి ముడిచిపెట్టుకుని కూర్చోకు నువ్విలా ఉంటే నాకేమీ తోచదు డియర్" అంటూ బలవంతంగా కౌగిట్లో ఇరికించుకున్నాడు

"ఇదిగో ! బాగుండదు నన్ను వదిలెయ్యండి" ముఖం అసహ్యంగా పక్కకు తిప్పుకుంది

హతాశుడై చటుక్కున వదిలేశాడు రఘు

తలుపులు బార్లా తెరిచివచ్చి క్రింద బెడ్‌షీట్ పరుచుకుని పడుకుంది

దీర్ఘంగా నిట్టూర్చి మంచంమీద పడుకుని కళ్ళు మూసుకున్నాడు అతని మనసంతా గిజిబిజిగా ఉంది

"రేణు ఎందుకిలా మాట్లాడుతోంది ? నేనేదో చెయ్యరాని పని చేసినట్లు అలా అసహ్యించుకుంటోందేమిటి ?" ఎంత ఆలోచించినా అర్థం కాలేదతనికి

కానీ, ఆ విషయం మరో నాలుగు రోజులకే పూర్తిగా అర్థమైంది ఆ నాలుగు రోజులు అతని తప్పించుకునే తిరిగింది రేణుక

ఆ రోజు నర్సింగ్‌హోమ్ నుంచి తొందరగా వచ్చేసి సూట్‌కేసులో రెండు జతల బట్టలు సర్దుకుంటూ "నేను హైదరాబాదు వెడుతున్నాను" అన్నాడు, ఏ గోడకో చెప్తున్నట్లుగా

అల్లుకుంటున్న జడని వెనక్కివేసి సరిచేసుకుంటూ "నేనూ వస్తాను" అంది రేణుక

"అవసరంలేదు ఈ నాలుగు రోజులనుంచీ అర్థం పర్థం లేకుండా నన్ను సాధించినది చాలు అక్కడికి వెళ్ళి కూడా దెబ్బలాడుకోవాలా ?"

"నేనొస్తే మీకు అడ్డు అని చెప్పరాదూ ?"

"అవును అడ్డే ! సరేనా ?"

"రామ రామ ! మరీ ఇంత బరి తెగించి పోయాక ఇంకా ఆ నంగనాచి కబుర్లు ఎందుకు ?"

"ఏమిటే ? నేనేం చేశానని నన్నిలా చంపుకు తింటున్నావు ? ఛ ఛ ! మరీ టూ మచ్‌గా బిహేవ్ చేస్తున్నావు."

"అహా ! మీరు చేసే పని బాగుంది కాబోలు చెల్లెలి లాంటిది ! అంటూ తల్లిదండ్రులు కాదంటున్నా దాన్ని తీసికెళ్ళి హైదరాబాదులో పెట్టి నాలుగు రోజులకోసారి ఇక్కడి పనులన్నీ వదిలిపెట్టి అక్కడికి పరుగెడుతూండడం ఛ ఛ ! సిగ్గుగా అనిపించడంలేదూ ? అలాంటప్పుడు దాన్నే కట్టుకోకపోయారా ? ఏరికోరి కట్టుకుని నన్ను ఇలా ఏడి "

"రేణూ !" ఆమె చెంప చెళ్ళుమంది కోపంతో అతని ముఖం కందిపోయి కళ్ళు ఎర్రబడ్డాయి రేణుక మాటలకి కోపాన్ని అపుకోలేక పోయాడు చేతులు నలుపుకుంటూ గుక్కపట్టి ఏడుస్తున్న బాబుని ఎత్తుకున్నాడు

చెంపచేత్తోపట్టుకుని స్థాణువులా నిలబడి పోయింది రేణుక

"ఏమిటి బాబూ, ఏమైంది ?" హడావిడిగా, కంగారుగా లోపలికొచ్చారు విశ్వనాథంగారు ప్రభావతమ్మ

"ఏమీలేదు అంకుల్ నేను హైదరాబాదు వెడుతున్నాను లీలకి ఏమైనా చెప్పమంటారా ?" కోపాన్ని లోలోపలే అణుచుకుని సౌమ్యంగా అడిగాడు

"నేను చెప్పాల్సింది ఏమీలేదుగానీ, రేణు అంత సరదా పడుతోంది తీసికెళ్ళకూడదూ ?" అంది ప్రభావతమ్మ

"ఇప్పుడు వీలుకాదు ఆంటీ మరోసారి తీసికెడతాను"

"ఎప్పటికప్పుడే అలా అంటున్నావు వీలుకానంత అర్జంటు పన్లు ఏమున్నాయి" అన్నారు విశ్వనాథంగారు

"తీరా తీసికెళ్ళాక నాలుగూ చూపించే వీలు కుదరకపోతే మళ్ళీ అదొక పేచీ, మరోసారి తీరిగ్గా మనందరం కలసి బయలుదేరివెళ్ళి పది రోజులు ఉండి అన్నీ స్థిమితంగా చూసివద్దాము"



‘‘మేమెందుకులే నాయనా ముసలాళ్ళం, ఈసారి తప్పకుండా వీలుచూసుకుని అమ్మాయిని, పిల్లాడినీ తీసికెళ్ళి నాలుగూ చూపించి తీసుకురా’’ అని తన గదిలోకి వెళ్ళివచ్చి కొన్ని నోట్లు రఘు చేతిలో పెట్టి ‘‘లీలకి ఇచ్చి వాడుకోమను’’ అన్నారు విశ్వనాధంగారు ఒకసారి తలతిప్పి రేణువైపు చూసి సూట్‌కేసు తీసుకుని గబగబా వెళ్ళిపోయాడు రఘు

*  *  *

ప్రభావతమ్మ సావిట్లో కూర్చుని వత్తులు చేసుకుంటూ వీధి అరుగుమీద రైతులతో విశ్వనాధంగారు చెప్తున్న కబుర్లు వింటోంది యాంత్రికంగా ఏదో కాలక్షేపం కోసం ఆ పని చేస్తోందే తప్ప ఆ పనియందు ఉత్సాహం చూపించడంలేదామె వడలిన శరీరం, కృంగిన మనసు, ఆమె వయసును ఎక్కువ చేస్తున్నాయి ఆ కళ్ళల్లో నిరాశ స్పష్టంగా గోచరిస్తోంది రఘు నర్సింగ్‌హోమ్‌నుంచి ఎప్పుడు వస్తాడో, ఎప్పుడు వెడతాడో తెలియదు ఎవరికి వారే యంత్రాల్లా, బ్రతక్క తప్పదన్నట్లు కాలం గడుపుతున్నారు

‘‘నాన్నా !’’ కబుర్లు ఆపి తల తిప్పి చూసిన విశ్వనాధంగారు లీలని, ఆ వెనుక ఉన్న జయరామ్‌ని చూసి నిజమా కలా అన్నట్లు ఒక్కక్షణం అలాగే నిలబడిపోయారు

‘‘ఏమిటి మామయ్యా ! అలా నిలబడి పోయారు ?’’ జయ పలకరింపుతో ‘‘తల్లీ ! నిజంగా నువ్వేనా ?’’ అన్నారు ఆనందోద్వేగంతో

రైతులందరూ ఒక్కొక్కరే వెళ్ళిపోయారు

‘‘నాన్నా !’’ ఆయన ఎదమీద వాలి ఏడ్చేసింది

‘‘నా తల్లీ ! ఇన్నాళ్ళకి ఈ ముసలాళ్ళమీద జాలేసిందమ్మా ?’’

‘‘అలా అనకండి నాన్నా’’ తండ్రి నోరు మూసింది

‘‘అరె ! ఏమిటోయ్ ఇది ? ముందు లోపలికి పదండి ’’ లీల భుజంమీద మెల్లగా తట్టాడు జయ

ప్రభావతమ్మ కూతుర్ని చూడగానే సంతోషంతో కన్నీరు కార్చింది అంతలోనే గంభీరవదనయై ‘‘ఏమ్మా ! అక్కడ కూర్చుని నీ సుఖం కోసం ఒక పచ్చని కాపురంలో నిప్పులు పోశావు కదే పెళ్ళయిన వాడిని వల్లో వేసుకుని స్నేహితురాలి జీవితంలో నిప్పులు పొయ్యి ’’

‘‘అమ్మా’’ చెవులు రెండూ మూసుకుని గట్టిగా అరిచింది లీల

మెల్లగా అడుగులు వేస్తూ తల్లి దగ్గరకు వెళ్ళి భుజాలమీద చేతులు వేసి ‘‘అమ్మా ! నువ్వు చెప్పేదేమిటో బొత్తిగా అర్థం కావటం లేదు వివరంగా చెప్పమ్మా’’ అంది బ్రతిమాలు తున్నట్లుగా

‘‘నువ్వు చదువు పేరుతో హైదరాబాదులో కాపురం పెట్టి రఘుని నీ చుట్టూ తిప్పుకుని సంసారం చేస్తున్నావని తెలిసి రేణుక గుంటూరు వెళ్ళిపోయింది తిండి తిప్పలు మానేసి పిచ్చివాడిలా అయిపోయాడు రఘుబాబు అతనితో అలా తిరగాలనుకున్నదానివి రేణుని తీసుకొచ్చి, రాఘవులు మావయ్యని ఒప్పించి పెళ్ళెందుకు జరిపించావే వాళ్ళిద్దరికీ ?’’

‘‘అమ్మా !’’ అలాగే బొమ్మలా నిలబడిపోయిందొక క్షణం మరు నిముషంలో తేరుకుని గబగబా కళ్ళు తుడుచుకుని జయరామ్ దగ్గరకు వెళ్ళి చెయ్యి పట్టుకుని ‘‘పద జయా ! రేణుని తీసుకుని వద్దాం’’ అంటూ బయటకి లాక్కుపోయింది

(ఇంకా ఉంది)

B మరాళి కృష్ణారెడ్డి సమర్పించు

కృష్ణా ఆర్ట్ క్రియేషన్స్



స్క్రీన్‌ప్లే-దర్శకత్వం పి చంద్రశేఖరరెడ్డి BA,

నిర్మాత బి గోపాలరెడ్డి

కథ నిర్వహణ డి ఆర్ చెన్నారెడ్డి

నిర్మాణాత కె ఆర్ ఆనంద్

ఫోటోగ్రఫీ వియస్ ఆర్ స్వామి

సంగీతం చక్రవర్తి

మాటలు పరుచూరి బ్రదర్స్

అన్నపూర్ణ

# షాలోకుని షేరి

## పంటిబలంలో ప్రపంచ రికార్డు !

వాల్టర్ ఆర్ఫియుల్లీ అనే వో కలియుగ భీమసేనుడి పదకొండు రైలుపెట్టెల బండికి వో తీగ (ముందు పెట్టెకి) బిగించి, ఆ తీగను పళ్ళతో కరిచిపట్టుకుని బరబర లాగి ప్రపంచ రికార్డును స్థాపించాడట ఈ రైలుపెట్టెల బరువు 1'' టన్నులట ఇంతకు ్రకితం యీయనే యీ పని చేసి 182 టన్నుల రైలును లాగి ప్రపంచ రికార్డు నలనాడు స్థాపించి, తన రికార్డును తానే యీనాడు బద్దలు కొట్టాడట – భీమసేనుడు తన పళ్ళతో యిలాటి అద్భుతాల్జేసినట్టు వినలేదే !

## డిగ్రీ కాఫీ !

తమిళనాడులో కొన్నిచోట్ల కాఫీలోని మంచి వెరయిటీ – స్ట్రాంగ్ కాఫీని డిగ్రీ కాఫీ అంటారుట అనగానేమి అని విచారిస్తే పాలను లాక్టో మీటరుతో తూచి, నీరు కలపని పాల డిగ్రీ చూపాక, అట్టి పాలతో కలిపే కాఫీని డిగ్రీ కాఫీ అంటారుట తిరుచ్చిలో ఈ రకం కాఫీని సూపర్ కాఫీ అంటారుట

## పని పిల్లపై అత్యాచారం !

ధర్మపురికి చెందిన పెణ్ణాగిరవ్ అనే వూరిలో 16 ఏళ్ళ మహేశ్వరి అనే పనిపిల్ల గొడ్లసాల బాగు చేస్తూండగా ఆమె అందాన్ని కొంత కాలంగా చూసి గుటకలేస్తున్న 25 ఏళ్ళ శివరాజ్, 26 ఏళ్ళ మహేంద్రవ్ అనే యిద్దరు ఇంద్రులు ఆమె మీదపడి, అరవకుండా నోరు మూసి కామదాహం తీర్చుకున్నారట అంతా అయ్యాక పోలీసులు వీరిని అరెస్టు చేశారట

అత్యాచారం జరిగిన తరువాత దుష్టులను శిక్షించడం మా ప్రధాన కర్తవ్యం!



## విరక్తితో బాలిక ఆత్మహత్య !

తమిళనాడుకు చెందిన కన్నంకురిచ్చి అనే గ్రామంలో 16 ఏళ్ళ పరిమళ అనే అమ్మాయి ఫదోక్లాసు అత్తెసరు మార్కులతో ప్యాసయిందట దానికామె తలిదండ్రులు రితే పద్ధతిలో అష్టోత్తర శత తిట్లు వుత్సవం జరిపేసరికా పిల్ల ఆ విషయాన్ని వో వుత్తరంలో రాసి, తనకు తత్ఫలితంగా జీవిత విరక్తి కలిగిందనీ రాసి, నూతిలో దూకి ఆత్మహత్య చేసుకుందట – అమ్మాడీ !

## హత్యకి దారితీసిన తగాదా !

తమిళనాడు నండ్రై ఊత్తుక్కుళి అనే గ్రామానికి చెందిన రామసామి సంతలో ఆవులను అమ్మి ఆ డబ్బుతో తను పుట్టిపెరిగిన గ్రామం భామగవుండంపాలెం వెళ్ళి తన ఆనాటి స్నేహితులతో పీక మొయ్యా తాగి, తందనా లారంభించాడట అదేపని చేస్తున్న ఆ వూరుకు చెందిన సుబ్రహ్మణ్యం అనే ఆసామి నువ్వు మా వూరెందుకొచ్చావని రామసామిని నిలదీసి, సాచో లెంపకాయ కొట్టాడట దాంతో రామసామి ఎగిరి చేతికి అందిన వో రాయిని ఆతనమీద బలంగా విసిరాడట ఆ రాయి తగిలిన సుబ్రహ్మణ్యం ఆయ్ అని అరుస్తూ, వో బండ రాయితో రామసామి బుర్ర రామకీర్తన పాడించాడట దెబ్బకు రామసామి బుర్ర పగిలి, రక్తపు మడుగులోపడి, విలవిల్లాడి తన్నుకు చనిపోయాడట

## నరహంతక వానరాలు !

తమిళనాడుకు చెందిన కరూరుకు సమీపంలో వున్న మరమత్తి అనే వో వూరికి వో రెండు కోతులు వచ్చాయట ఆ కోతులు మనిషిని కొరికి, మాంసకండ వూడలాగి తిని, మనుష్య రక్తం జుయ్యిన పీలుస్తున్నాయట వో లారీ డ్రయివరు మీదపడి, అతన్ని కరిచి, నెత్తురు సువ్వున పీల్చి అతన్ని పిప్పిచేసి చంపాయట మరో యిద్దరు అపాయ స్థితిలో కరూరు ఆసుపత్రిలో చేరారట. మనుష్య రక్తం రుచి మరిగిన యీ కోతులను ప్రాణాలతో పట్టుకోడం కుదరక, చివరికి చంపేశారట కోతులను పట్టే వృత్తివారు ఈ కోతులకు నరమాంస భక్షణాసక్తి, ఆ శక్తి ఎందుకొచ్చిందని ప్రభుత్వపు ఆ విభాగ విజ్ఞానం ఆశ్చర్యపోతోందట–ఇటిజిట్స్ డ్యూటీ !

## పెరుగులో శక్తి !

ఒక చిన్న గిన్నెడు పెరుగులో ప్రతి ఘన సెంటీమిటర్లోనూ మనిషికి అత్యధికశక్తిని యిచ్చే బాక్టీరియా సుమారు 20 కోట్లు వుంటుందట కనుక పెరుగు మనిషికి చక్కని అతి బలమైన ఆహారమని విజ్ఞానులంటున్నారుట

## ఉల్లికన్నా యాపిల్ చౌక !

పంజాబు, హర్యానా రాష్ట్రాలలో ఈనాడు కిలో వుల్లిపాయలు అయిదు రూపాయలయితే కిలో ఆపిల్ పళ్ళు మాత్రం నాలురూపాయలేనట అయితే మాత్రం కూరల్లోనూ, పులుసుల్లోనూ వుల్లిపాయకు బదులు ఆపిల్ వాడగలమా !?

ఇటీవలి కాలంలో నిత్యావసర వస్తువులధరలు పెరగడంలో మనం ఘనమైన అభివృద్ధి సాధించాం!



## పావురాలద్వారా మత్తుమందుల రవాణా !

మలేషియా – తాయిలండ్ సరిహద్దులలో గంజాయివంటి మత్తు పదార్థాల రవాణాకు పావురాల నుపయోగించుకుంటున్నారట పావురాలకి ఈ పనిలో ప్రత్యేకమయిన శిక్షణలనుకూడా యిస్తున్నారట పావురం సామాన్యంగా చాలా ఎత్తుకు వెళ్ళి అక్కడ ఎగిరి పయనిస్తుంది ఈ చర్యవల్ల కస్టమ్స్‌శాఖవారు ఈ రాకెట్టును ఎన్ని కష్టాలుపడ్డా అంతగా పట్టుకోలేకపోతున్నారట

## బేరరు స్థాపించిన ప్రపంచ రికార్డు!

ఒక పోర్చుగీసు హోటలులో పనిచేసే జోవో మాన్యువల్ సవుసా ఫెర్రియా అనే ఒక బేరరు ట్రేలో రెండు బీరు సీసాలు, రెండు గ్లాసులూ పెట్టుకు పట్టుకుని ఏకబిగిన 135 కిలోమీటర్లు నడిచి, ప్రపంచ రికార్డు స్థాపించి గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్ట్స్‌లోకి తన పేరు ఎక్కించమని మంకుపట్టు పట్టాడట ★



# భయం

'సింహం'



రాత్రి పది దాటింది

చలి ఎక్కువగా వుంది

రామాటాకీసు దగ్గిర లారీకోసం నిలడ్డాడు బాబులు

మనసంతా బెరుకుబెరుకుగా వుంది ఒకసారి ప్యాంటుజేబు తడిమి చూసుకున్నాడు గుండె ఝల్లుమంది బాబులు చాలా సాహసం చేస్తున్నాడు జేబులో పదివేల రూపాయలు, హార్డ్ క్యాష్ వుంది చాలా అవుసరంగా పదివేల రూపాయలు తీసుకుని తనవూరు బయల్దేరాడు

"లారీలో వెళ్ళొద్దు ఆ లారీలవాళ్లు మంచివాళ్ళు కారు, పది అయిదు కోసం కూడా ప్రాణాలు తీసేస్తూ వుంటారు అలాంటిది పదివేల రూపాయలు మీ దగ్గర వున్నాయని తెలిస్తే మిమ్మల్ని ప్రాణాలతో బతకనివ్వరు దయచేసి నామాట విని మీరు లారీలో వెళ్ళొద్దు"

బాబులు భార్య కళ్ళనీళ్ళతో బ్రతిమాలుకుంది

అయినా సాహసం చేసే బయల్దేరాడు "నా దగ్గర అంత డబ్బు వున్నట్టు ఎవరికి తెలుస్తుంది నేను బైట పెడితే కదా!" ఇదీ బాబులు వాదన ఇంట్లోవాళ్ళు అభ్యంతర పెట్టేవారే కాని అవతల అవుసరం అలాంటిది

అప్పటికే విజయనగరం వెళ్ళే లాస్ట్ బస్సు వెళ్ళిపోయి గంటకి పైగా అయింది అప్పటికి రెండు రోజులబట్టి రాత్రి పదకొండున్నరకి రావలసిన అన్నవరం ఎక్స్ప్రెస్సు రావట్లేదు బ్రేక్‌డౌన్ అట పోనీ ట్రైన్‌లో వెళదామంటే ఆరోజు మధ్యాహ్నామే వాల్తేరు విజయనగరం లైనులో కొత్తవలస దగ్గర పెద్ద రైలు ప్రమాదం జరిగి రైళ్ళ రాకపోకలు స్థంభించి పోయాయి అటువంటి పరిస్థితుల్లో బాబులుకి అంత డబ్బుతో తన స్వగ్రామం వెళ్లేపని పడింది తెల్లారేలోగా డబ్బుతో అక్కడికి చేరుకోకపోతే తమ కుటుంబం పరువు ప్రతిష్టలు మంటగలిసిపోయే ప్రమాదం ఏర్పడింది

వందో రెండొందలో ఇచ్చి టాక్సీని కట్టించుకుని వెళ్లమని కొందరు సలహా ఇచ్చారు బాబులుకి

"ఏం? ఆ టాక్సీ డ్రైవరు మోసం చెయ్యడని గ్యారంటీ ఏమిటి? అయినా సలహా ఇచ్చేరు కనక మీలో ఒకరో ఇద్దరో నాతో కూడా రాకూడదా టాక్సీలో వెళ్లి రేపు తిరిగొచ్చేద్దాం"

బాబులు లలాగనేసరికి సలహా ఇచ్చినవాళ్లు చల్లగా జారుకున్నారు

ఆలోచనల మధ్య బాబులు ఎదురుగా వస్తున్న లారీకి చెయ్యి అడ్డం పెట్టాడు

"ఎక్కడికెళ్లాలి?"

ఆగిన లారీ లోంచి క్లీనరు అడిగాడు

"జొన్నాడ"

"ఐదురూపాయలవుతుంది"

బాబులు ఎక్కి కూర్చున్నాడు డ్రైవరు క్లీనరుకాక తనొక్కడే వున్నాడు లారీలో ఎందుకో బాబులుకి చిన్న భయం లాంటిది గుండెలో ప్రవేశించింది లోపల కేబినులో లైటు లేదు అయినా డ్రైవరు వైపు చూసాడు

ఎదురుగుండా ఏదో వాహనం వచ్చింది ఆ వెలుగులో డ్రైవర్ని చూసిన బాబులుకి గుండె పీచుమంది నల్లని శరీర ఆకారం, చింపిరి జుట్టు, ఎర్రని కళ్ళు, నుదుటిమీద గంటు, కుడి చెంపమీద ఉలిపిరికాయ, రెండు చురకత్తులు తగిలించినట్లున్న కోరమీసాలు, ఆ

# భయం

మీసాల క్రింద భుగభుగమని పొగవదుల్తున్న సిగరెట్టు, మాసిన గెడ్డం, మెడచుట్టూ మఫ్లరు వుంది నల్లని చొక్కావేసుకున్నాడు కండలు తిరిగినచేతులు స్టీరింగుని గట్టిగా పట్టుకున్నాయి తీక్షణంగా రోడ్డువైపే చూస్తున్నాడు మనిషిని చూస్తే ఎన్ని హత్యలైనా చిటికలో చేసెయ్య గలడు అనిపించేలా వున్నాడు

బాబులు చెయ్యి అప్రయత్నంగా పేంటు జేబుమీదకి వెళ్ళింది గుండె దిటవుచేసుకుని సర్దుకుని కూర్చున్నాడు

''ఏం పంతులూ! డబ్బులుగాని పట్టు కున్నావేంటి ?''

డ్రైవరు ప్రశ్నకి పక్కలో బాంబు పడ్డట్టు అదిరిపడ్డాడు బాబులు తీక్షణంగా రోడ్డువైపే చూస్తున్నవాడు తనని ఎలా గమనించాడో అర్థం కాలేదతనికి అంత చలిలోను మొహం చెమటలు కమ్మింది అయినా తమాయించుకుని –

''అబ్బే కొన్ని ముఖ్యమైన ఆఫీసు కాగితాలు జేబులో పెట్టుకుని పట్టుకెళుతున్నాను''

అన్నాడు తడబాటు బయటికి తెలియ నివ్వకుండా

అతను చెప్పింది అబద్ధం అనే విషయం డ్రైవరుకి తెలిసిపోయిందని అతనికి తెలియదు

జేబులోంచి సిగరెట్టు ప్యాకెట్ తీసి సిగరెట్ నోట్లో పెట్టుకుని అగ్గిపుల్ల గీసి వెలిగించాడు ఆ వెలుగులో క్లీనర్ని చూసి ఉలికిపడ్డాడు బాబులు ఎందుకంటే అతను తన ప్యాంటు జేబువంకే చూస్తున్నాడు

తను పులిబోనులో చిక్కుకున్నానని పించింది బాబులుకి

ఎదురుగుండా రోడ్డువైపు చూసాడు నల్లత్రాచు మెలికలు తిరుగుకుంటూ లారీ క్రిందనించి జోరుజోరుగా వెళ్ళిపోతున్నట్లని పించింది బాబులుకి అడ్డుగా వున్న మంచు పొరలను ఛేదించుకుంటూ లారీ ముందుకు దూసుకుపోతోంది అప్పటికింకా ''ఎండాడ'' దాటింది

ఒక్క కుదుపుతో లారీ ఆగిపోయింది

అయోమయంగా డ్రైవరువైపు చూసాడు బాబులు

డ్రైవరు గంగు క్రిందకు దిగాడు రెండో వైపునుండి క్లీనరు కన్నా కూడా దిగాడు ఇద్దరూ కలిసి బోనెట్టు పైకి ఎత్తారు రేడియేటరులో నీళ్ళు అయిపోయాయి కన్నా ఒక డబ్బా పట్టుకుని నీళ్ళకోసం వెళ్ళాడు అయితే నీళ్ళు దగ్గరలోనే వున్నాయి డబ్బాతో నీళ్ళు తెచ్చి రేడియేటరులో పోసేడు

ఇంతలో వెనకనుంచి మరో లారీ వచ్చి అక్కడ ఆగింది అందులోంచి డ్రైవరుతో కలిపి నలుగురైదుగురు క్రిందికి దిగేరు దిగిన వాళ్ళలో ఇద్దరి చేతిలో గునపాలు వున్నాయి

''ఏం గంగూ! ఏదైనా రిపేరా ?''

అడిగాడు ఆ లారీ డ్రైవరు గంగూని

ఇదంతా కేబిన్‌లోంచి బాబులు చూస్తూనే వున్నాడు

గింగూ లారీవైపు చూపిస్తూ ఏదో చెబుతున్నాడు అవతల లారీడ్రైవరు గునపాలు పట్టుకున్నవాళ్ళని కేబిన్‌వైపు వెళ్ళమని సంజ్ఞ చేస్తున్నాడు

బాబులు వెన్నులోంచి సన్నగా వణుకు ప్రారంభమైంది

అవతల లారీలోని ముగ్గురు వ్యక్తులు వచ్చి బాబులు కూర్చున్న క్యాబిన్ తలుపులు తీసారు

బాబులుకి పై ప్రాణాలు పైనే పోయాయి

అర్ధరాత్రి, నట్టడవి ఈ అడవిలో వాళ్ళు తనని చంపేసి ఇక్కడే ఎక్కడైనా పాతేస్తే తనకు దిక్కెవరు కాకపోతే తన దగ్గిరున్న డబ్బు వాళ్ళ చేతుల్లో పెట్టేసైనా తన ప్రాణాన్ని కాపాడు కోవాలి బాబులు ఆలోచన్లు ఇలా సాగిపోతు న్నాయి ఇంతలో గంగు స్టీరింగువైపు తలుపు తీసాడు బాబులు గుండె ఆగి కొట్టుకోవడం ప్రారంభించింది

''ఏయ్ పంతులూ! క్రిందికి దిగు''

మేఘం గర్జించినట్లు వినిపించింది బాబులుకు

''ఎ ఎ ఎ ఎందుకు ?''



భయం భయంగా అడిగాడు బాబులు

"దిగవయ్యా"

మళ్ళీ గర్జించాడు గంగు

ప్రాణాలకి ఆశ వదులుకుని క్రిందికి దిగాడు బాబులు

"అరేయి ఆ సీటెత్తి దాన్లో ఒక గునపం వుంటుంది తియ్యంర్రా"

గంగు వాలకంతో బాబులు గొంతు పూర్తిగా తడారిపోయింది తనని చంపడానికి వ్యూహం తయారైపోతోంది తనింక ఎంతోసేపు ఈ భూమ్మీద బ్రతకడు ఈ ప్రక్కనుంచిగాని ఆ ప్రక్కనుంచిగాని ఏదైనా వాహనం వస్తే బాగుండును పోనీ ఇక్కడనుండి పారిపోతే క్షణంలో పట్టుకుంటారు రెండవ క్షణంలో భూస్థాపితం చేసేస్తారు తను సాహసంచేసి వాళ్ళ చేతుల్లో చిక్కుకుపోయాడు వీళ్ళు చూస్తే ఒకొక్కడూ పాతిక హత్యలైనా ఒకోసారి చేసేలా కనపడుతున్నారు

ఇంతలో —

వాళ్ళందరూ కలిసి లారీ వెనక్కి వెళ్ళారు గునపాలతో బాడీ వెనక తలుపుని బాదారు అది కాస్త ఊడి వచ్చింది దాన్ని మళ్ళీ బిగించి గునపం లారీలో పడేసి ఒకళ్ళ కొకళ్ళు వీడ్కోలు చెప్పుకుని ఎవళ్ళ లారీ వాళ్ళు ఎక్కిపోయారు

గండం గడిచినట్టుగా భావించాడు బాబులు కాస్త తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు ఏమో ఈ లారీ వాళ్ళని ఎవడు నమ్మమన్నాడు తెల్లవారి లేస్తే వీళ్ళు చేసే ఘాతుకాలు ఎన్ని పేపర్లో చదవడం లేదు బితుకు బితుకు గానే బండి ఎక్కాడు బాబులు లారీ బయల్దేరింది

"ఏం పంతులూ ! జొన్నాడేనా ఇంకేదైనా ఊరెళ్ళాలా" అడిగాడు గంగు

"ఏ వూరైతేనేం మీరు నన్ను వెళ్ళనిస్తే గదా" అని మనసులో అనుకొని "జొన్నాడ దగ్గర దిగి ఒక మైలు లోపలికి వెళ్ళాలి" అన్నాడు బాబులు

"ఏది పంతులూ ఒక సిగరెట్టు ఇయ్యి"

ముందు వెళ్తున్న కారుని ఓవర్ టేక్ చేస్తూ అడిగాడు గంగు

"నా ప్రాణాలు తియ్యడానికి ఇది ఫీజు అన్నమాట" అని మనసులోనే తిట్టుకుంటూ ఒక సిగరెట్టు తీసి గంగూ కిచ్చాడు బాబులు

లారీ మధురవాడ దాటింది కొంత దూరం వెళ్ళక ఎడంవైపునున్న నాటు రోడ్డులోకి తిరిగింది

మళ్ళీ బాబులు గుండెలు గుభేలుమన్నాయి

"ఇటెక్కడికి తోల్తున్నారు రూటు మార్చేసి" తడబడుతూ అడిగాడు బాబులు

"చిన్న పనుందిలే"

గీరగా సమాధానం చెప్పాడు గంగు

నిండా మునిగిన వాడికి చలేమిటి అని తనకు తాను ధైర్యం చెప్పుకున్నాడు బాబులు లారీ ఒక మైలు దూరం లోపలికి వెళ్ళి అక్కడ ఆగింది అప్పటికే అక్కడ ఎండాడ దగ్గిర కలిసిన లారీ, అందులో మనుషులూ వున్నారు

"ఒరే కన్నా! గునపం తీసుకువెళ్ళి వాళ్ళు చూపించిన చోట గొయ్యి తవ్వు" అని ఆర్డరు జారీచేసాడు గంగు వెంటనే కన్నా కాళ్ళ దగ్గరున్న గునపం తీసుకుని ముందుకు వెళ్ళాడు గంగు కూడా లారీ దిగి వాళ్ళు గొయ్యి తవ్వుతున్న ప్రదేశానికి వెళ్ళాడు ఆ ప్రదేశం లారీకి చాలా దూరంగా వుంది అక్కడికి చెరిన డ్రైవర్లిద్దరూ తనున్న లారీ వైపే చేతులు చూపించి మాట్లాడు కోవడం ఆ పక్కనే నలుగురు గొయ్యి తవ్వడం లారీ హెడ్‌లైట్ల వెలుతురులో దూరం నుంచి చూస్తున్న బాబులుకి ఈసారి తను రక్షింప ఒడడం అసాధ్యం అనిపించింది కాని ఇందాకా వేసినంత భయం వేయలేదు దానికి కారణం బహుశ భయపడడం అలవాటయిపోవడం వల్లనేమో !

కళ్ళు మూసుకుని ఇష్టదైవాన్ని ప్రార్థించడం మొదలెట్టాడు బాబులు

అత్యవసరంగా పదివేల రూపాయల సొమ్ము తన స్వగ్రామానికి తీసుకు వెళ్ళవలసిన అవుసరం పడడం, తను సాహసం చేసి అర్ధరాత్రిపూట ఈ లారీలో బయల్దేరడం, గంగు లాంటి కసాయివాడి చేతికి సింహానికి చిక్కిన మేకపిల్లలా చిక్కిపోవడం

'ఇంకొక గంటలో తనని ఉరి తీస్తారని తెలిసిన ఖైదీ పరిస్థితి లా' వుంది బాబులు పరిస్థితి

"ధబ్" మని తలుపేసిన చప్పుడు అవడంతో ఉలికిపడి లేచాడు బాబులు అప్పటికే లారీ రివర్సయి రోడ్డు వైపుకి సాగిపోతోంది మరో గండం గడిచింది అనుకున్నాడు బాబులు లారీ రోడ్డెక్కి ఆనందపురం వైపు దారి తీసింది

"గురూ ! ఎంకులు గాడు ఆ వంద రూపాయలూ ఇవ్వనన్నాడు"

బీడీ దమ్ము లాగి ఆ లారీ హోరులో గంగుకి సరిగా వినపడదేమోనని గట్టిగా అన్నాడు కన్నా

"సరికేస్తానని చెప్పు నాయల్ని"

తల ఎగరేస్తూ చాలా నిర్లక్ష్యంగా అన్నాడు గంగు రోడ్డుమీంచి దృష్టిని మళ్ళించకుండానే

"వీడన్నంత పని చేసేలా వున్నాడు" అనుకున్నాడు అక్కడి శ్రోత అలాగనుకునేసరికి అతని వెన్నులో తగ్గిన భయం మళ్ళీ ప్రవేశించింది

అప్పటికి లారీ ఆనందపురం దాటిపోయింది

తనెలాగైనా చిట్టివలసలో దిగిపోవాలి అక్కడ తనకు తెలిసిన వాళ్ళున్నారు వాళ్ళ సాయం తీసుకుని ఈ రాత్రి ఎలాగైనా తన వూరు చేరుకోవాలి అంతేగాని ఈ గంగుగాడి చేతిలో అర్ధాంతరం చావు చావకూడదు తనెన్నో సార్లు విశాఖపట్నం నుండి జొన్నాడ రాత్రుళ్ళు ప్రయాణం చేసాడు తనకెన్నడూ ఇటువంటి పరిస్థితి ఎదురవలేదు ఈవేళ ఈ డబ్బు తనకి మరణవేదన కల్పిస్తోంది తనెలాగైనా చిట్టివలసలో దిగిపోవాలి దృఢ నిశ్చయం చేసుకున్నాడు బాబులు

ఒక నిశ్చయానికి రాగానే అప్రయత్నంగా అతనిలోంచి ఒక నిట్టూర్పు బయటికి వచ్చింది ఎలాగైనా ఈ గండం గడిస్తే చాలు అన్నభావం ఉంది అందులో అతనికి తెలీకుండానే అతని చెయ్యి డబ్బున్న జేబుమీద బిగుసుకుంది

తనవిగాక అక్కడున్న నాలుగుకళ్ళూ తననే గమనిస్తున్నాయన్న సంగతి అతనికి తెలీదు

లారీ చిట్టివలసవైపు గాకుండా డైరెక్టు



# భయం

రోడ్డువైపు చెప్పాడు గంగు తననుకున్న ప్లాను పారకపోయేసరికి గాభరాపడిపోయాడు బాబులు

"అదేంటి తగరపువలస వెళ్ళదా" అయోమయంగా అడిగాడు బాబులు

"నువ్వు తగరపువలసలో దిగవుకదా !" ఆ మాటని గంగు వెటకారంగా అన్నట్లు వినిపించింది బాబులుకి

"టీ తాగుదామని" చిన్న అబద్ధం ఆడేడు బాబులు

"రాజాపులోవలో ఆపుతాను అక్కడ తాగుదుగాన్లే" కత్తి నూరిన గరగర వినిపించింది గంగు గొంతులో కిమ్మనకుండా వూరుకున్నాడు బాబులు

లారీ రాజాపులోవలో ఆగింది అంతకు ముందే అక్కడ మరో రెండు లారీలు ఆగి వున్నాయి

గంగు, కన్నా లారీ దిగేరు

"ఏయ్ పంతులూ ! ఏదీ నీ ఛార్జి డబ్బులియ్యి"

జేబులోంచి అయిదురూపాయల నోటు తీసి గంగుకి అందించేడు బాబులు

"నువ్వు టీ తాగుతానన్నావు తాగుతావా!"

"ఒద్దులే"

"పర్లేదు రావయ్యా తాగుదువుగాని"

చనువుగా బాబులు జబ్బపట్టుకుని లాగాడు గంగు

"అమ్మో ! వీడు నాకు కుషామత్తు కొట్టి నన్ను మోసం చేద్దామనుకుంటున్నాడు వీడి మాటలు నమ్మకూడదు" అని మనసులోనే అనుకుని—

"నాకొద్దులే నువ్వెళ్ళు – ఈలోగా నేనో చిన్న కునుకు తీస్తాను" అని మరి గంగు వైపు చూడకుండా వెనక్కి జారబడ్డాడు బాబులు

"సరే నీ యిష్టం" అంటూ గంగు, కన్నా అక్కడున్న పాకలోకి దూరారు

బాబులు నెమ్మదిగా రెండో వైపునుండి లారీ దిగాడు అలికిడి కాకుండా ముందున్న లారీల దగ్గరికి నడిచాడు గంగు బారినుండి తప్పించుకుపోవాలన్న అతని ఆశయం నెరవేరలేదు ఆ రెండు లారీలు బ్రేక్ డౌన్ అయినవి కనుచూపుమేరలో ఎక్కడా ఏ వాహనమూ వస్తున్నట్లు లేదు చుట్టూ గాఢాంధకారం అక్కడున్న పాకలోంచి వస్తున్న సన్నని వెలుతురు తప్ప ఎక్కడా ఏ విధమైన వెలుతురూ లేదు పోనీ ఇక్కడనుండి పారిపోతే? లారీలో తను లేకపోవడం చూసి గంగుగాడు కన్నాగాడు తను పట్టుబడేదాకా వెతుకుతారు అయినా తెల్లారేలోగా తను తన వూరు చేరుకోవాలి ఏది ఏమైతేనేం మళ్ళీ ఆ లారీలోనే ప్రయాణం చెయ్యడానికి నిశ్చయించుకున్నాడు బాబులు చప్పుడు కాకుండా వచ్చి లారీలో కూర్చున్నాడు

ఇంతలో టీకి వెళ్ళిన గంగు, కన్నా కూడా వచ్చేరు మళ్ళీ లారీ బయల్దేరింది

లారీ నీలయమ్మ సత్రం దగ్గిరికి వచ్చేసరికి ఒకతను రోడ్డుకి అడ్డుగా నిలబడి లారీని ఆపుచేసాడు అతని వాలకం చూస్తే మోటారు కులంవాడిలాగే కనిపించాడు బాగా మాసిపోయి ఆయిలు మరకలతో వున్న ఖాకీబట్టలు తొడుక్కున్నాడు ఆ బట్టలమీద అక్కడక్కడ ఎర్రటి మరకలు కూడా వున్నాయి అవి ఖచ్చితంగా రక్తపుమరకలే అయ్యుంటాయి అనుకున్నాడు బాబులు అలా అనుకోగానే అతనికి ఒళ్ళు జలదరించింది

"బండి ఆపుగురూ ! ఈడు మన జోగులుగాడు" సంభ్రమంగా అన్నాడు కన్నా

కీచుమంటూ ఆగింది లారీ

"ఏరా జోగులూ! ఎల్లిన పనేటయింది?" అడిగాడు గంగు పక్కనున్న డోరులోంచి తల బైటకుపెట్టి

"అయిపోయింది గురూ !" అంటూ లారీ ఎక్కాడు జోగులు

"ఆడేటోనా అన్నాడా ! ఏటేనా అల్లరి

## "సూక్తి"

జీవితమే ఒక స్వప్నం
తిరిగే రంగుల రాట్నం
విధితో ఆటలు నిత్యం
ఎన్నడు ఆగదీ కాలం
మాటలు రాని పసికందు —
తియ్యని బోసినవ్వులతో
నీదేదో — నిప్పేదో
తెలియక ఆటలు ఆడింది
నందనవనమును చూసింది —
పూపులు పిందెలు చూసింది
నీతేదో — నిజమేదో
తెలియక పొరపడి కోసింది
పసితనమే తొలిఘట్టం —
ఆపైన వచ్చును యవ్వనం
ఎదురుగ రంగుల బొమ్మలు —
ఎదలో వలపులరెమ్మలు
వయసేదో — తొందరచేసె
దారులు తప్పే తలపులు
చుట్టూ చీకటి ముసిరింది —
మదిలో శాంతి మాసింది
నావారు — నీవారు
అందరూ చివరికి పైవారే
అనుభవమే తుదిఘట్టం —
చావన్నదే ఒక సత్యం ?

— గంధం సాయిరమేష్ (రాధ)

పెట్టావా!'' (బేకుమించి కాలుతీస్తూ అడిగాడు గంగు

''అల్లరిపెడితే నరికేనా నాయాల్ని ''

జేబులోంచి బీడీకట్టతీసి కన్నాకొకటిచ్చి తనొకటి వెలిగించుకున్నాడు జోగులు

''మరైతే బట్టలమీద ఎ(ఱటి మరక లేటి ?''

''అదా! ఏదో గొడవ జరిగిందిలే ''

వాళ్ళ సంభాషణ వింటున్న బాబులుకి గుండె దడదడ లాడింది వీళ్ళిద్దరికీ తోడు మరొకడు వీళ్ళకి మనుషుల్ని నరకడం తప్ప మామూలుగా మాట్లాడడం తెలీదనుకుంటూ

''భగవంతుడా! వీళ్ళ బారి నుండి నన్ను కాపాడు ''

కళ్ళు మూసుకుని ఇష్టదేవతా (ప్రార్థన చేయసాగాడు బాబులు

లారీ ఒక్క కుదుపుతో ఆగింది

అయిపోయింది తన పని అయిపోయింది, ఇంక తనని సజీవ సమాధి చేసేస్తారు వీళ్ళు భయంతో వణికిపోసాగాడు బాబులు

''ఏయ్ పంతులూ! జొన్నాడ వచ్చింది దిగవా!''

భుజాలు పట్టుకుని కుదిపాడు గంగు

కళ్ళు తెరిచాడు బాబులు

నిజమే, తను నిజంగా జొన్నాడ వచ్చేసాడు అవన్నీ చిన్నప్పట్నుండీ తను మసలిన (ప్రదేశాలే ఆ మిల్లు, మిల్లు పక్కన పెద్ద గొయ్యి రెండింటి నడుమనుండి సన్నని కాలిబాట ఆ బాటగుండా ఒక మైలు దూరం వెళితే తన వూరు ఆనందంతో ఒక్క ఉదుటున లేచాడు తన సీటులోంచి బాబులు (క్రిందకు దిగబోతూ నుండగా చెయ్యి పట్టుకున్నాడు గంగు

''పంతులూ! ఇప్పటికైనా చెప్పు నీజేబులో వున్నదేంటి ? డబ్బేనా!'' అడిగాడు

''ఏం కాదులే! చెప్పానుగా ఆఫీసు కాగితాలని'' అంటూ గంగు చెయ్యి విదిలించుకుని లారీలోంచి కిందికి దూకేశాడు బాబులు

లారీలోంచి బయట పడగానే యావజ్జీవ కారాగారశిక్ష అనుభవించి బైటపడిన ఖైదీలాగ అనుభూతి పొందాడు బాబులు

కాని అప్పుడే అతనికి అసలు (ప్రమాదం ఎదురైంది

''ఏయ్ పంతులూ! పంతులూ!'' అనుకుంటూ లారీ దిగేడు గంగు అతని వెనుకే జోగులు దిగేడు జోగులు చేతిలో ఒక ఇనప కడ్డీకూడా వుంది వాళ్ళని చూడగానే గుండెలు రారుమన్నాయి బాబులుకి వాళ్ళిదరి చేతికి చిక్కితే తనపని సరి అనుకున్నాడు బాబులు

అంతే

ఎక్కడలేని తెగింపు వచ్చేసింది అతనికి తన ఊరివైపు పరుగు లంకించుకున్నాడు




అతనిని వెంబడిస్తూ పరుగెట్టసాగారు గంగు, జోగులూను

(ప్రాణాలన్నీ గుప్పిటలో పెట్టుకునిపరుగెత్తుతున్నాడు బాబులు బాగా పరిచయమైన బాట కాబట్టి సునాయాసంగా పరిగెట్టేస్తున్నాడు బాబులు గంగు, జోగులుకి ఆ (ప్రాంతం కొత్తవడంవలన బాబులంత జోరుగా పరుగెత్తలేక పోతున్నారు

ఇప్పుడు తను ఏ మా(త్రం వెనుకబడినా వాళ్ళకి పట్టుబడిపోవడం ఖాయం తన (ప్రయత్నం అంతా వృధా అయిపోతుంది ఇప్పుడు తన (ప్రాణాలు పోతాయి రేపు తన కుటుంబం పరువు (ప్రతిష్టలు బజార్న పడతాయి

---

ఇటీవల విశాఖపట్నంలో ఆం(ధ్ర విశ్వ విద్యాలయ సాంస్కృతికోత్సవాలలో శాస్త్రీయ నృత్య పోటీలలో బహుమతి పొందిన ఏలూరు సి ఆర్ ఆర్ కళాశాల విద్యార్థి శ్రీముదపాక వెంకటేశ్వరరావు, భరతకళా (ప్రపూర్ణ కోరాడ నరసింహారావుగారి శిష్యుడు



పళ్ళబిగువున పరుగెత్తసాగాడు బాబులు పది నిమిషాల్లో ఊర్లోకి వచ్చిపడ్డాడు

ఊరిముందు గోర్జి దగ్గర ఆగిపోయారు గంగు, జోగులు

ఆయాసంతో ఒగరస్తూ వచ్చిన కొడుకుని చూసి కంగారుపడ్డారు బాబులు తల్లిదం(డులు

''ఏఁవైందిరా ?'' ఆ(తుతగా అడిగారు వారిద్దరూ ఒకేసారి

''నన్ను చంపడానికి ఇద్దరు పరుగెత్తుకొస్తున్నారు'' —

భయంవలన బాబులుకి మాట సరిగా రాలేదు మరుక్షణంలో అతను స్పృహతప్పి పడిపోయాడు

*　　*　　*

లారీ విజయనగరంవైపు బయల్దేరింది

''ఏం గురూ! అతన్ని వెంటాడేవు ?'' అడిగేడు జోగులు గంగుని

''ఆ పిచ్చిబేమ్మడి దగ్గర బోల్డంత డబ్బుంది ఈ చీకట్లో ఎవరైనా అతన్ని తన్ని లాక్కుంటే! అతని (ప్రాణాలు కూడా పోతాయి! పోనీ సాయం వస్తామంటే అతను మనల్ని నమ్మడు అందుకే అతన్ని భయపెడుతూనే అతనికి సాయంగా వాళ్ళ వూరు వరకూ దిగపెట్టి వచ్చాను '' అన్నాడు తృప్తిగా గంగు

''ఎందుకు గురూ! ఇట్టాంటి రిస్కు తీసుకుంటావు ? ఆ మధ్యనోసారి ఇట్టాంటి రిస్కు తీసుకుంటేనే గదా యవ్వారం పోలీసు టేసను దాకా ఎల్లింది ''

జోగులు చెబుతున్నాడు

గంగులోని మనిషి ఆ మాటలను పట్టించుకోవడం లేదు

లారీ విజయనగరం పొలిమేరల్లోకి వచ్చేసింది ★

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
# దంత క్షయాన్ని ఎదుర్కోండి.






కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది...
మీ పళ్లు ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది.

**ఎలాగో చూడండి:**



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది.



ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుంచి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు.

గుర్తుంచుకోండి, ప్రతిసారీ భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.

## దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!

GK&E B82 86 TL



DO YOU WANT A SON?
If you have only daughters & want a son, try our course.
It has been tried with 100 percent success.
YOU PAY OR SPEND NOTHING UNTIL THE CHILD IS BORN.
LIMITED OFFER
For details write immediately to Box No.






Forhan's

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## డాక్టర్ చంద్రశేఖరమ్

మన పూర్వులు నేతి నేతి—ఇది కాదు, ఇది కాదు—అని వివేచిస్తూ పరమ సత్యాన్ని దర్శించడానికి ప్రయత్నించారు సత్య లక్ష్యసాధనకు సత్య మార్గం అవసరమన్నా గాంధీజీ ఈ రెండు పద్ధతులనూ సమన్వయించి ఇదికాదు అదికాదు అని నటన ద్వారా — అసత్యం ద్వారా — సత్యాన్ని దర్శించడానికి నిరంతరం ప్రయత్నిస్తున్న సాధకుం, నా దృష్టిలో సాధించిన సిద్ధులు డాక్టర్ వైద్యుల చంద్రశేఖరంగారు ఆయన మహారాష్ట్ర ఆంధ్ర కర్నాటక తమిళ సంస్కారాల తెలిమీగడ తేట అందువల్ల ఈ నాలుగు జాతుల ఉత్తమ సంస్కారం మూర్తీభవించింది ఆయనలో గానం భగవంతుని ఇష్టమని దాని ద్వారా భగవంతుని చేరవచ్చునని నారద విష్ణు పురాణాలు ఉద్ఘోషిస్తున్నాయి భరతముని మొదలయిన ప్రాచీన నాట్య శాస్త్రజ్ఞులు కూడా నటన ద్వారా నటరాజును చేరవచ్చునన్నారు దీనిని పూర్తిగా ఆచరణలో పెట్టిన నటన యోగి చంద్రశేఖరంగారు నటునికి తాను అనుకరిస్తున్నానని, తాను చేసేది అసత్యమని తెలుసు కాని దాని ద్వారా ఒక సత్యాన్ని ప్రజల ముందు పెడుతున్నాడు వారికి మనోవిలాసంతో పాటు నీతిని ఆధ్యాత్మిక దీప్తిని అందిస్తున్నాడు ఈ విధంగా నటుడు అసత్యమార్గంలో మానవులను సేవిస్తూ మాధవుని చేరుతున్నాడు కనుక నటన ఐహిక సుఖదాయకమనడంకన్నా ఆముష్మిక అమృతత్వ సంధాయకమంటారు చంద్రశేఖరం అసత్యం ద్వారా సత్య నిరూపణం సత్యదర్శనం, సత్యసంప్రాప్తి ఆశ్చర్యం కాదా? అని ప్రశ్నిస్తారు ఆయన నటుడు ఏ స్థితిలో వున్నా తన లక్ష్యాన్ని— సామాజికులకు చైతన్యం కలిగించడం ద్వారా సర్వోత్తమ సాయుజ్యం పొందే లక్ష్యాన్ని విడనాడరాదంటారు ఆయన అందువల్లనే తాను ధరించే ప్రతి పాత్రలోను పరమాత్మను దర్శించగలుగుతున్నారు ఎనభయ్యేళ్ళ పైబడినా ఎనిమిదేళ్ల బాలునిలాగ నటించగలుగుతున్నారు ఆయన చంద్రశేఖరం అనుకరించని ప్రపంచ నాయకుడు లేడు సామాన్యుడూ లేడు కేవలం ఆహార్యంతోనేగాదు వాచికంతో, ప్రవర్తనతోను ఆయన అనుకరణ వాస్తవాన్ని కమ్మగట్టేస్తుంది దానికి కారణం తలీనత, తన్మయత ఏ పాత్రను అనుకరించదలచినా అతని రూపరేఖలతోపాటు మాటచేత కూడ ఆవహిస్తాయి చంద్రశేఖరంను ఆయన వాడే అయిపోతాడు ఇదే అసత్యంలో సత్య దర్శనం ఈ విధంగా ఆయన అన్ని పాత్రలలోను భగవంతుకే దర్శిస్తారు చంద్రశేఖరం నెల్లూరులో 1904లో జన్మించారు మాతృభాష మహారాష్ట్రం వైద్య వంశం అదే తెలుగులో వైద్యుల అయింది 1921లో తండ్రి శ్రీ సుబ్బారావుగారు — కాలధర్మం చెందడంతో చంద్రశేఖరం చదువు మెట్రిక్‌తో ఆగిపోయినది జీవికకోసం తిరుపతిలో నెయ్యి ఖద్దరు అమ్మారు ఎదప నెల్లూరు జిల్లా బోర్డు ఆఫీసులో గుమాస్తాగా చేరాడు అప్పటి నుంచే నటనానక్తి కలిగి క్రమంగా వికసించి ఆయననొక నట యోగిగా, నట సిద్ధునిగా తీర్చింది ఆయన ఆహార్యంతోపాటు నటనకు సంబంధించిన సకల విషయాలలోను పారమ్యం పొందారు 1953లో చైనాలో 1967లో రష్యాలో తమ ఆహార్యాది నైపుణ్యం ప్రదర్శించి మన్ననపొందారు కొద్దిమంది నటులతో చాల కొద్ది పరికరాలతో గ్రామాలు, పారిశ్రామిక వాడలు గనులు మున్నగు చోట్లకు వెళ్ళి తాత్కాలిక రంగస్థలాలు నిర్మించుకొని ఉచిత ప్రదర్శనాలిచ్చి వేలకొలది ప్రజలకు నాటకానందం కలిగిస్తున్నారు యువకులకు నాటకానుభవం కలుగజేస్తున్నారు నాటకోపనిషత్తు నాటక భగవద్గీత కర్మయోగం, ప్లే — యాక్టింగ్ అండ్ సెల్ఫ్‌రియలైజేషన్ మున్నగు గ్రంథాలు వ్యంగ్యరీతిలో ఆంధ్రాంగ్లాలలో రచించారు రంగజ్యోతి అనే ఆంగ్ల మాస పత్రికను నిర్వహిస్తున్నారు నటన సత్యాన్ని దర్శింపజేసే అసత్యం కాని ఈ సత్యాన్ని తెలుసుకొన్నంత మాత్రాన నేను సంతృప్తి చెందను ఈ జీవిత నాటకం కోసం, ఈ ప్రపంచ ప్రవృత్తి కోసం అసంఖ్యాక అసత్యాల మధ్యగ వున్న నేను నేనే సత్యమనే అనుభవం పొందదలిచాను ' అంటారు చంద్రశేఖరం ఈ జిజ్ఞాసతోనే ఆయన అన్ని పాత్రలలోను ఆత్మను (తనను) — అంటే పరమాత్మను దర్శిస్తున్నారు ఆయన ఆహార్యం చేసుకుంటున్నప్పుడు చూడముచ్చటగా వుంటుంది క్షణాలలో ఆహార్యం చేసుకొనే నేర్పరులలో ఆయన అగ్రశ్రేణివారు సహస్ర చంద్ర దర్శనం చేసుకొన్న డాక్టర్ చంద్రశేఖరం కనీసం మరొక అర్ధసహస్ర చంద్ర దర్శనాలు చేసుకొని మనకు ఆనందం కలిగించాలని కోరాను ఆయన్ను ఇటీవల కలుసుకొన్నప్పుడు

## ఉపశ్రుతి

ఏం సార్, డబ్బు కట్టి ఐదేళ్ళు గడిచాయి రెండవ జర్నలిస్టు కాలనీలో మన కొంపలింకా లేవలేదే ?' — అనడిగారు నన్నొక పాటి జర్నలిస్టు ' మరేం కంగారు పడకండి మనకందరికీ స్వగృహంలో మరణయోగం వుంది కనుక ఇళ్ళు లభించడం తప్పదు ' అన్నారు జోస్యం తెలిసిన మరొక జర్నలిస్టు



డాక్టర్ చంద్రశేఖరం



ఆహార్యం చేసుకుంటున్నప్పుడు



రాష్ట్రపతి వేషం వేసినప్పుడు



# సెనగపిండి వాడినా, పసుపు వంటికి రాసినా
# శరీరం తెల్లబడేనా—ఏమంటావు ఓ మనసా!

పసిమి ఛాయ ఎందులో వుంది? సెనగపిండి, నిమ్మరసం - గ్లిసరీన్, పసుపు, పాల మీగడ, దోస రసం. ఈ పారంపరిక చిట్కాలు మహాయిస్తే చర్మానికి కాస్త నిగారింపు ఇస్తాయి అంతే కాని వంటి ఛాయని నిజంగా తెల్లబరుస్తాయా?

## మీ చర్మం రంగును నిర్ణయించేది ఏమిటి?

మీ చర్మం లోపల మెలానిన్ అనే నల్లని రంగు పదార్థం వుంది ఇది చర్మంలో ఎంత ఎక్కువగా వ్యాపిస్తే మనుషులు అంత నల్లగా కనబడతారు. మీ చర్మం రంగు మీద ప్రభావం చూపే బయటి కారణాలు కూడా ఉన్నాయి. ఎండలో మీరు బయటికి వెళ్లినప్పుడు సూర్యరస్మిలోని అల్ట్రావయొలెట్ కిరణాలు మిమ్మల్ని మరింత నల్లబరుస్తాయి



## వంటి ఛాయను పెంచడానికి సరియైన పద్ధతి ఏదైనా ఉందా?

ఉంది మొట్టమొదటిసారిగా సాధించిన ఓ వైజ్ఞానిక విజయం ఫెయిర్ అండ్ లవ్‌లీ—నల్ల చర్మాన్ని తెల్లపరిచే క్రీమ్ ఇది మీ చర్మం నల్లబడటాన్ని అరికట్టి తిరిగి ఎర్రగా రంగుతేలేలా చేస్తుంది.

## ఫెయిర్ అండ్ లవ్‌లీ ఎలా పనిచేస్తుంది?

లోపలా. బయటా 2 విధాలుగా.

చర్మం లోపల: ఫెయిర్ అండ్ లవ్‌లీ క్రీము చర్మం అడుగున మృదువుగా, సురక్షితంగా పనిచేసి. నల్లబడుతున్న చర్మం తిరిగి రంగు తేలేలాగ చేస్తుంది.

చర్మం బయట: ఫెయిర్ అండ్ లవ్‌లీలోగల 'సూర్య రస్మిని వడబోసే' ప్రత్యేక పదార్థాలు, అల్ట్రావయొలెట్ కిరణాలు మీ చర్మాన్ని నల్లబరచకుండా అడ్డగిస్తాయి. అయినప్పటికీ, సూర్యరస్మిలోని ఆరోగ్యమంతటినీ మీరు పూర్తిగా పొందగలుగుతారు

## రంగు తేలడానికి కేవలం 6 వారాలు!

ఫెయిర్ అండ్ లవ్‌లీని ఆరు వారాలపాటు క్రమం తప్పకుండా రోజుకు రెండుసార్లు రాసుకోండి. మొదట, చర్మం మీద కాస్త జిమజిమలాడవచ్చు. ఫెయిర్ అండ్ లవ్‌లీ పనిచేస్తున్నదనడానికి అది నిదర్శనం. ఆరు వారాల్లో ఖచ్చితమైన తేడా మీకు కన్పిస్తుంది, ఇతర్లకీ కన్పిస్తుంది. క్రమం తప్పకుండా వాడుతూ ఉండండి, ఫెయిర్ అండ్ లవ్‌లీ శరీర ఛాయతో అలాగే వుంటారు మీరు.

ఫెయిర్ అండ్ లవ్‌లీ గురించి మీరు మరిన్ని వివరాలు తెలుసుకోవాలనుకుంటే, ఈ చిరునామాకు వ్రాయండి:

FAIR & LOVELY ADVISER,
P.O. BOX 758,
BOMBAY 400 021.




**ఫెయిర్ అండ్ లవ్‌లీ**

నల్ల చర్మాన్ని ఎర్రపరిచే క్రీమ్

హిందూస్థాన్ లీవర్ వారి
విశిష్ట ఉత్పత్తి

ఇది సహజంగా, మృదువుగా మీ వంటి ఛాయను పెంపొందిస్తుంది.

LINTAS-FALOV-30-2316 TL













ఇటీవల నగర నట సమాఖ్య, నిజామాబాద్ వారు నిర్వహించిన నాటకోత్సవాలలో శ్రీ గౌతమ కళాసమితివారు ప్రదర్శించిన 'గారడి' నాటికలో ఒక దృశ్యం శ్రీ చంద్ర ప్రకాశ్, చి ఎ హరీష్‌లని చిత్రంలో చూడవచ్చు

## అవీ–ఇవీ–అన్నీ

### 1984 భాగ్య అవార్డు

1984 సం॥పు "భాగ్య అవార్డు"నకు 1–1–81 నుండి 31–12–83 ల మధ్య అనగా మూడేళ్ళ వ్యవధిలో వచ్చిన ప్రథమ ముద్రణ నవలలను పంపవలయును వ్రాత ప్రతులను పంపరాదు ప్రచురణ కర్తలు కూడా పంపవచ్చును కాని రచయితకు మాత్రమే అవార్డు ఇవ్వబడును అనువాదాలు పరిశీలింప బడవు

ఈ అవార్డు పేరున నగదు రూ 116లు ఒక మెమెంటో (250 రూ ల విలువగలది) ఇవ్వబడును

ఈ అవార్డు పరిశీలనార్థం ప్రతి పుస్తకం 4 ప్రతులనుపంపాలి చివరి తేది 31 3 1984 వివరాలకి శ్రీ టి శ్రీరంగస్వామి, కార్యదర్శి, 5 11 114/4, విద్యారణ్యపురి, వరంగల్లు–506 009 కి వ్రాయాలి ★

*Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press Mallikarjuna Rao St Gandhinagar Vijayawada 3*
*Editor S Radhakrishna*




## ఎందుకంటే ఫారెక్స్ పాపాయిల సత్వరమైన మరియు సంపూర్ణమైన పెరుగుదల కోసం అధిక పుష్టికరమైన ఘన ఆహారం.

### మీ పాపాయి పెరుగుదల కోసం ప్రొటీన్‌తో సమృద్ధమైనది ఫారెక్స్

నిర్దేశించిన రీతిలో ఫారెక్స్ తయారుచేసి ఇస్తే అది మీ పాపాయి పెరుగుదలకు అత్యావశ్యకమైన ప్రొటీన్ సమృద్ధంగా కల్గి వుంటుంది.

### ఆరోగ్యవంతమైన రక్తం కోసం అదనంగా ఐరన్ కల్గి వున్నది ఫారెక్స్

పాపాయి రక్తానికి, రోగ-ప్రతిరోధక శక్తిని ఎక్కువ చేయడానికి, అతని సామాన్య ఆరోగ్యం మరియు పెరుగుదల కోసం ఐరన్ అత్యంత ముఖ్యం. మీ పాపాయికి పుట్టుకతోనే ప్రకృతి అందించే కానుక ఐరన్. అతడు పెరిగే కొద్దీ దీని నిల్వ తరిగిపోతుంది.

మూడు-నాలుగు నెలల తర్వాత మీ పాపాయికి కావలసిన ఐరన్ కేవలం పాలు మాత్రమే సమకూర్చలేవు. అందుచేత, ఆ దశలో, మీ పాపాయికి ఐరన్ కల్గిన ప్రత్యేక ఘన ఆహారం కావాలి. బ్రాండు చేయబడిన ఇతర ఘన ఆహారాల కంటే ఫారెక్స్‌లో ఎక్కువ ఐరన్ కలదు.

### పాపాయి పళ్లు మరియు ఎముకలకు అతి ముఖ్యమైన కాల్షియం మరియు ఫాస్ఫరస్ సరియైన నిష్పత్తిలో కల్గి వున్నది ఫారెక్స్

పళ్లు మరియు ఎముకలు చక్కగా ఏర్పడటానికి మీ పాపాయికి కావాలి కాల్షియం మరియు ఫాస్ఫరస్. కాని ఈ రెండూ 2 : 1 నిష్పత్తిలో కలిసి వుంటేనే పాపాయికి ఎక్కువ లాభం చేకూరుతుంది. ఈ అత్యావశ్యక తత్వములను ఆదర్శ ప్రాయమైన నిష్పత్తిలో కల్గి వున్నది ఫారెక్స్. ఇది మీ పాపాయి ఎక్కువ ఆరోగ్యవంతమైన ఎముకలు మరియు ఎక్కువ దృఢమైన పళ్లు నిశ్చయంగా పొందేలా చేస్తుంది.

### ఎంతో సులభంగా జీర్ణమవుతుంది ఫారెక్స్

మీ పాపాయి సున్నితమైన జీర్ణశక్తికి అనువుగా ప్రత్యేకంగా ముందుగానే పచనం చేయబడినది ఫారెక్స్.






డాక్టర్లు సిఫార్సు చేస్తారు

**ఫారెక్స్®** గ్లాక్సో ఉత్పాదన

CLARION/GX/1/244 TEL